కావ్యకంఠ శ్రీవాసిష్ఠ గణపతిముని విరచిత

# హెూరా నిర్ణయ సంగ్రహం

(త్రిభావ ఫలచంద్రిక, షోడశ శ్లోకితో సహా)



తెలుగున తాత్పర్యము

**కీ.శే.మద్దూరి కృష్ణమూర్తిశాస్త్రిగారిచే సమకూర్చబడెను.**

వెల అమూల్యం

## కావ్యకంఠ వాసిష్ఠ గణపతిముని పరిచయం

పండితుడు, జ్యోతిష్యుడు, మరియు ఆధ్యాత్మిక వేత్త , మంత్రవేత్త, తపస్వి, యోగి, రమణమహర్షి శిష్యులలో ప్రముఖుడు. అంతేవాసి ఆయిన గణపతిముని కావ్యకంఠ వాసిష్ఠ గణపతి మునిగా ప్రసిద్దులు. వీరిది విజయనగరము జిల్లాలోని కలవరాయి అగ్రహారము. అయ్యల సోమయాజుల నరసింహశాస్త్రి, నరసమాంబ దంపతులకు రెండవ సంతానముగా నవంబర్ 17, 1878నాడు జన్మించారు. పదియేండ్ల వయసునందే తెలుగు, సంస్కృత భాషలందును, వేదములు, తర్కశాస్త్రము, గణితశాస్త్రము, జ్యోతిషశాస్త్రము మరియు ఆయుర్వేదములో అసమాన ప్రతిభ చూపినారు.

వీరి యొక్క వాక్చాతుర్యము, సంస్కృతభాషా ప్రావీణ్యము మరియు అన్ని శాస్త్రములందు విశేషమైన ప్రతిభతో 'కావ్యకంఠ' బిరుదమును పొందిరి. వీరు ఉమాసహస్రము, శ్రీరమణగీత, ఇంద్రాణీసప్తశతీ, మహావిద్యాది సూత్రావళి, గీతమాల, విశ్వమీమాంస వంటి ఎన్నో గ్రంథాలను రచించారు. గణపతిముని అరుణాచలంలో శ్రీరమణ మహర్షిని దర్శించి వారి బోధనలను ప్రపంచానికి తెలియ చేసారు. 'నాయన' అను ప్రియనామముతో ప్రకాశించిన గణపతిముని జూలై 27, 1936న పరమపదించారు.

ఈ హోరానిర్ణయ సంగ్రహమును గణపతిముని పరాశరపద్ధతిలో జ్యోతిష్య లకు సులభంగా బోధపడేవిధంగా కేరళీయపద్ధతిని కూడా కలుపుకుని సంగ్రహముగా మనకు అందించారు. వీరి పద్ధతి ప్రకారము మొత్తం 12భావాలలో బేసి భావాలు లగ్న పంచమ,నవమాలు కోణములు శుభులు.

వానికి సప్తమంలో ఉన్న తృతీయ, లాభ, సప్తమభావాలు అశుభాన్ని కలుగచేస్తాయి. అలాగే సరిభావాలు ఆరింటిలో 6,8,12భావములు శుభాన్ని యివ్వవు. 2,4,10భావములు శుభమును కలుగచేస్తాయి. ఈ విధంగా చూస్తే మిగిలిన పరాశారీ గ్రంథాలకంటే వ్యతిరిక్తంగా గణపతి ముని 6వభావానికి బదులుగా సప్తమ భావాన్ని పాపఫలితం కలుగచేస్తుందని చెప్పారు. కొన్ని పరాశర గ్రంథములలో త్రిమదాయ అనే ప్రయోగము ఈయన చెప్పిన భావాన్ని సమర్ధిస్తున్నాయి. మూలగ్రంథం కేవలం జ్యోతిష విద్య తెలిసినవారిని ఉద్దేశించి వ్రాయబడింది. సామాన్య విద్యార్ధుళకు సుబోధకంగా వుండే విధంగా మా గురువు గారైన కీ.శే.మధుర కృష్ణమూర్తిశాస్త్రిగారిచే 1966లో తెనిగించబడింది. ఈ గ్రంథ ము తాత్పర్య సహిత వివరణతో మొదటిసారి తెలుగులో వారిచే అందించబడింది. ప్రస్తుతం అలభ్యమైన ఈ గ్రంథమును మా గురువుగారి జయంతిని పురస్కరించుకుని మా భారతీయ జ్యోతిర్వాస్తువిజ్ఞాన సంస్థ తరపున అందరికి అందజేయబడుతోంది.

-(((0)))-



**తెలుగు తాత్పర్యకర్త**

రాష్ట్రపతి అవార్డ్ గ్రహీతలు, మహామహోపాధ్యాయ

**కీ.శే. మధుర కృష్ణమూర్తిశాస్త్రి**

జననం 28-2-1928 మరణం 06-04-2016

# 1.సామాన్య సంజ్ఞాధ్యాయం

**కళ్యాణం కశ్చిదస్మాకం కరోతు జ్యోతిషాం పతి।**

**యస్య విష్ణువధూసౌధ కవాటోద్ఘాటనాః కరాః ॥ 1 ॥**

తా॥ గ్రహరాజైన సూర్యభగవానుడు మనకు మంగళం చేయుగాక. ఏ సూర్యుని కిరణములు లక్ష్మీ నివాసమైన తామరపూవు రేకులను వికసింపజేయునో, ఆ సూర్యుడు మనకు మంగళము గూర్చుగాక.

**మత మాలోచ్య శాక్తస్య మహర్షే-దీర్ఘ దర్శనః**

**దైవజ్ఞానాం ముదే కూర్మో హెూరా నిర్ణయ సంగ్రహమ్ ॥ 2 ॥**

తా॥ దీర్ఘదర్శియు, శక్తిపుత్రుడునగు పరాశరమహర్షి యొక్క మత విధానంలో దైవజ్ఞుల సంతోషము కొరకు 'హెూరా నిర్ణయ సంగ్రహ"మనే ఈ గ్రంథమును నేను రచించుచుంటిని.

**పూర్ణాలోకశ్చ సంయోగో గ్రాహ్యౌ సంబంధ శబ్దతః**

**సంయోగమాత్రే సంయోగ యోగ సంసర్గ సంగమాః ॥ 3 ॥**

తా॥ ఈ గ్రంథమందు 'సంబంధ' మనే శబ్దప్రయోగము వలన గ్రహముల యొక్క పూర్ణదృష్టి, సంయోగము(ఏక రాశ్యంశ స్థితి)రెండును చెప్పబడినట్లు గ్రహించ వలెను. అట్లుగాక 'సంయోగం, యోగము, సంసర్గము, సంగమము' అనే శబ్ద ప్రయోగములైనచో సంయోగ(ఏకరాశి స్థితి)మొక్కటి మాత్రము చెప్పబడినట్లు గ్రహించు కొనవలెను.

వివరణః- **ఈ గ్రంథములో ఉపయోగించిన కొన్ని పదములకుసంబంధము వివరణ ఇవ్వడం జరిగింది.-**

పూర్ణదృష్టి - గ్రహములు $1^0$ తేడాతో పరిశీలించడం

సంయోగము- ఒకేరాశి ఒకే నవాంశలో వుండడం.

యోగము, సంసర్గము,

సంగమము - ఒకరాశిలో వుండడం.

**గ్రాహ్యో పాదాది దృష్టిశ్చ దృష్టి వాచక శబ్దతః**

**శుభాశ్చాతి శుభాదేవా దైత్యాః పాపాతి పాపినః ॥ 4 ॥**

తా॥ దృష్టి - పాద, అర్థ, త్రిపాద, పూర్ణ దృష్టులు.

దేవతలు - శుభగ్రహములు, అతి శుభగ్రహములు,

దైత్యులు - పాపగ్రహములు, అతి పాపగ్రహములు.

**ధీసప్తో జన్మకోణాని ప్రతీపంతు తదస్తభమ్ ।**

**త్రికం షష్ఠాష్టమాంత్యాని శేషో భోగ ఇహోచ్యతే ॥ 5 ॥**

తా॥ కోణములు- 1, 5, 9

ప్రతీపములు- 3, 7, 11,

త్రికములు- 6, 8, 12

భోగములు- 2, 4, 10.

దక్షిణాధన షష్ఠాజ్ఞాః **సవ్యాఃసుఖమృతివ్యయాః।**

**రమా ఖ్యౌ మాతృదశమౌ విష్ణాఖ్యౌ భాగ్యపంచమౌ ॥ 6 ॥**

తా॥ ఈ పట్టికలో వివరములు చూడవచ్చును. ఇవన్ని లగ్నమునుండి

| 2,6,10 | దక్షిణ | 4,8,12 | సవ్యము |
|---|---|---|---|
| 4,10 | లక్ష్మీ | 5,9 | విష్ణు |

**పంచమస్యచ రాజ్యస్య ద్వితీయ శ్చత్రురాత్మనః (తః)**

**వ్యయశ్చతుర్థ తపసో ర్ద్వయం లగ్నస్య సస్మరమ్ ॥ 7 ॥**

తా॥ ఈ పట్టికలో వివరములు చూడవచ్చును. ఇవన్ని లగ్నము నుండి

| స్థానము | శత్రుస్థానము | స్థానము | శత్రుస్థానము |
|---|---|---|---|
| 1 | 2,7,12 | – | – |
| 4 | 3 | 5 | 6 |
| 9 | 8 | 10 | 11 |

**స్వతంత్రా ఆయుజోభావాః పరతంత్రా యుజోమతా।**
**కోణా భోగాః శుభాః ప్రోక్తాః శేషాః పాపాః స్వభావతః ॥ 8 ॥**

తా. భావముల శుభాశుభత్వ పట్టిక

| భావములు | ఫలితము |
|---|---|
| 1,3,7,9,11 | స్వతంత్ర ఫలితాలు |
| 2,4,6,8,12 | అస్వతంత్ర ఫలితాలు |
| 1,2,4,5,9,10 | శుభములు |
| 3,6,7,8,11,12 | అశుభము |

**నిసర్గ పద సద్భావే పాపా స్సూర్య సుతాదయః ।**
**శుభా గుర్వాదయశ్చేతి జ్ఞేయం సామాన్యశాస్త్రతః ॥ 9 ॥**

తా.గ్రహముల శుభా శుభములు.

శని, కుజ, రవి, క్షీణచంద్ర,పాపయుత బుధుడు –పాపగ్రహములు.

గురు, శుక్ర, పూర్ణచంద్ర, శుభయుత బుధుడు –శుభగ్రహములు

**ఫలాన్యతి శుభాదీనాం దశాస్వేవ వినిర్దిశేత్ ।**
**కాలా నపేక్షం వక్ష్యే రాజయోగాది జాతకే ॥10॥**

తా॥ జాతకములందు భావాధిపత్యాన్ని బట్టి గ్రహములు తమ దశాంతర్దశలలో శుభపాపఫలితములను ఇస్తాయి. ఫలితం/ఫలితకాలంతో నిమిత్తం లేకుండా భావాది పత్యాన్నిబట్టి రాజయోగ నిర్ణయం చేయాలి. (గ్రహముల నైసర్గిక శుభాశుభములను బట్టి నిర్ణయము చేయరాదు.

**శ్రీపతి షడ్విధం వీర్యం సంజ్ఞారిష్టే వరాహతః।**
**ఫలాని విందన్నేతస్మా ద్దైవజ్ఞో విజయీభవేత్ ॥11॥**

తా॥ శ్రీపతి పద్ధతి అనుసరించి షడ్బలసాధనము, వరాహమిహిరుని గ్రంథము (బృహజ్జాతకం)అనుసరించి సంజ్ఞారిష్ట భావములను, ఈ హెూరానిర్ణయ సంగ్రహం అనుసరించి దశాదిఫలితములు చెప్పిన దైవజ్ఞుడు విజయమును పొందును.

(ప్రథమాధ్యాయము సమాప్తము)

–(0)–

# 2. విశిష్ట సంజ్ఞాధ్యాయం

**కోణ భోగపతిః కోణ త్రికేద్భోగ ప్రతీపపః**

**త్రిక ప్రతీపపో భౌమ ముఖ్యేష్వతి శుభాదయః ॥ 1 ॥**

తా॥ కుజాది (పంచగ్రహములైన కుజ,బుధ,గురు,శుక్ర,శనిలలో ) గ్రహములకు లగ్నాధిగా రెండేసి రాశులకు ఆధిపత్యములు వస్తాయి. ఈ ఆధిపత్యములచే ఏర్పడే శుభాశుభాములు ఈ క్రింది పట్టికలో చూడవచ్చును.

| మొదటి ఆధిపత్యం | రెండవ ఆధిపత్యం | ఫలితము |
|---|---|---|
| కోణం(1,5,9) | భోగం(2,4,10) | అతిశుభుడు |
| కోణం(1,5,9) | త్రికం (6,8,12) | శుభుడు |
| ప్రతీప(3,7,11) | భోగ (2,4,10) | పాపి |
| త్రిక (6,8,12) | ప్రతీప (3,7,11) | అతిపాపి |

**అపి స్వభావతః పాపం పరతంత్రతయా త్రికస్థః**

**కోణేన బలినా శ్లిష్టం భవతి క్షీణ విక్రమః ॥ 2 ॥**

తా॥ సహజముగా పాపస్థానములైన త్రికములు(6,8,12) అస్వతంత్రములు కావునా ఆ స్థానాధిపతులు స్వతంత్రఫలితాలను కలుగచేసే కోణస్థానములను పొంది నపుడు తమ పాపత్వమును తగ్గించుకుంటారు (కోణములు స్వతంత్రములు శుభరాశు లు కనుక ఆ స్థానములను పొందిన త్రికాధిపతుల పాపము క్షీణించును. ).

**పరతంత్రతయా భోగః స్వభావేన శుభో 2పి సన్।**

**పాప ప్రతీప సంశ్లేషాద్భవతి స్వగుణాచ్యుతః ॥ 3 ॥**

తా॥ సహజముగా శుభస్థానములైన భోగములు(2,4,10) ఫలితాలను ఇవ్వడంలో అస్వతంత్రమైనవి. ఈ భోగాధిపతులు స్వతంత్రములైన ప్రతీప(3,7,11)స్థానములు

పొందినపుడు తమ శుభత్వగుణమును కోల్పోవుదురు. (ప్రతీపములు స్వతంత్రమైనవే కాకుండా పాపరాశులు కనుక ఈ స్థానములను పొందిన భోగాధిపతులు శుభులైనను అస్వతంత్రులగుటచే పాపఫలితాలను ఇస్తారు).

**తనో స్సామాన్యతో మిత్రమసి శత్రుర్విశేషతః।**
**ద్వితీయో2తస్తయోరీశో నామ్నాగ్ర్యో2 నంతరః ఫలే ॥ 4॥**

లగ్నమునకు ద్వితీయస్థానము సామాన్యముగా మిత్రస్థానముగా చెప్పుకున్నా, విశేషంగా శత్రుస్థానముగా చెప్పవచ్చును. అందువలన ద్వితీయమగు ధనస్థానము పేరుకు మాత్రమే శుభుడుగాని అశుభఫలితాలనే కలిగిస్తాడు.(ద్వితీయాధిపతి మారకులలో ఒకరని ముందు తెలుస్తుంది).

**కోణాని స్వసమీపస్థ త్రికయుంజి శుభానిచేత్।**
**నాన్వయాద్భావ శక్తీనాం ద్వేషి స్వవ్యయయోఃక్షయాత్ ॥ 5 ॥**

కోణాధిపతులు శుభులైనను తమకు సమీపములోని త్రికాధిపతులతో కూడినపుడు శుభము నీయజాలరు. అలాగే త్రిక స్థానములను పొందినపుడు శుభమును ఇవ్వలేరు కారణమేమనగా కోణాధిపతులు నామమాత్ర శుభులు.

**భాస్వతో దక్షిణాస్సవ్యాః శీతాంశోస్సవ్య దక్షిణాః**
**శుభాశుభాద్వయోః కోణ ప్రతీపతి శుభాశుభే ॥ 6 ॥**

తా॥ రవికి 2,6,10లయిన దక్షిణ స్థానములు. చంద్రునకు 4,8,12లయిన సవ్యస్థానములు శుభములు. రవికి సవ్యములు, చంద్రునకు దక్షిణములు అశుభములు. రవి చంద్రులుభయులకు కోణములు శుభములు. ప్రతీపములు అశుభములు.

**షష్ఠనాథ్య సహస్రాంశుః చంద్రో రంధ్రాంత్యనాయకః।**
**లగ్ననాథ సుహృత్వేన న పాపవిత్యత శ్శుభౌ ॥ 7 ॥**

తా॥ సింహరాశ్యధిపతి రవి మీనలగ్నానికి షష్ఠాధిపతియైనను, కర్కాటకరాశ్యాధిపతి చంద్రుడు ధనుస్సింహలగ్న జాతకులకు అష్టమాధిపతియు, వ్యయాధిపతి అయిన కారణంగా ఆయా లగ్నాధిపతులకు రవి,చంద్రులు మిత్రులయిన కారణంగా వారు శుభులగుదురే కాని పాపులుకారు.

**లగ్ననాథా సుహృత్వేన దౌర్బల్యాదపి తద్దశి।**
**న శుభావిత్యతః పాప విమౌ వాహన కర్మపౌ ॥ 8 ॥**

తా॥ సింహరాశ్యాధిపతి రవి వృషభలగ్నమునకు చతుర్థాధి(వాహనాధి)పతియై నను, కర్కాటక రాశ్యాధిపతియగు చంద్రుడు తులాలగ్నమునకు కర్మస్థానాధిపతియైనను, వృషభ,తుల లగ్నములకు అధిపతియైన శుక్రునకు వారు పాపులే అగుదురే కాని శుభులు కారు.

*(రవి,చంద్రులు పూర్వ శ్లోకములో లగ్నమునుండి పాపస్థానములందున్నను లగ్నాధిపతితో వారికి గల మిత్రత్వమువలన శుభులగుదురని చెప్పబడెను. ఇక్కడ రవి, చంద్రులు శుభస్థానములందుండిరి. అట్లైనను లగ్నాధిపతికి శత్రువులగుటవలన వారికి శుభత్వము పోయి పాపత్వము వచ్చెను. ఈ విధముగా వ్యతిరేక శుభత్వ పాపత్వములు గ్రహములకు చెప్పబడెను.)*

(ద్వితీయాధ్యాయము సమాప్తము )

## 3. ఉదాహరణాధ్యాయము

**మేషస్య సూర్యోజీవార చంద్రాస్సౌరి సితౌ బుధః**
**శనిజ్ఞౌ భార్గవో భానుః చంద్రార గురవో వృషే ॥ 1 ॥**

**యుగ్మస్య సౌమ్య శ్శుక్రార్కీ చంద్రే జ్యౌ రవి భూసుతౌ**
**భౌమేందూ జీవ భూస్వంతౌ శుక్రోజ్ఞార్కీచ కర్కిణి ॥ 2 ॥**

**భౌమార్కౌ గురు శీతాంశూ శుక్రసౌమ్యౌ శనిర్హరౌ**
**స్త్రియాం సిత బుధౌ మందో గుర్వర్కావిందు భూసుతౌ ॥ 3 ॥**

**మందోజ్ఞ శుక్రౌ చంద్రారౌ సూర్యజీవౌచ తౌలిని**
**చంద్రజీవౌ రవి కుజౌ మందశ్శుక్ర బుధావలౌ ॥ 4 ॥**

**ధనుష్యర్క గురూ భౌమ చంద్రౌ బుధ శనీ సితః**
**శుక్ర మందౌ బుధో భౌమ రవీ చంద్ర గురూ మృగే ॥ 5 ॥**

**ఘటే శుక్రో బుధ శనీ భౌమేందు గురవోఽధమాః**
**కుజేందు గురవస్సూర్యో బుధ శ్శని సితౌ ఝషే ॥ 6 ॥**

తా॥ పై ఆరు శ్లోకములలో ద్వాదశరాశులందు ఏఏ గ్రహములు అతిశుభులు, శుభులు, పాపులు, అతిపాపులగుదురో వివరించబడెను.

**ద్వాదశానా మతిశుభాః క్రమా దేవం శుభా అపి**
**పాపినశ్చాతి పాపాశ్చ లగ్నానాం సముదాహృతాః ॥ 7 ॥**

తా॥మేషాది మీనరాశివరకు గల ద్వాదశ లగ్నములకు అతిశుభ,శుభ,పాపాతి పాపగ్రహ వివేచనమును క్రమముగా పైని చూపడమైనది.

మేషాది లగ్నములకు శుభాశుభ గ్రహము పట్టిక ప్రక్కపేజీలో చూడవచ్చును.

| లగ్నరాశి | అతిశుభులు | శుభులు | పాపులు | అతిపాపులు |
|---|---|---|---|---|
| మేషం | రవి | కుజ,గురు,చంద్ర | శని,శుక్ర | బుధ |
| వృష | శని, బుధ | శుక్ర | రవి | చంద్ర,కుజ,గురు |
| మిధున | బుధ | శుక్ర, శని | చంద్ర,గురు | రవి, కుజ |
| కర్కట | కుజ, చంద్ర | రవి, గురు | శుక్ర | బుధ, శని |
| సింహ | కుజ, రవి | చంద్ర,గురు | శుక్ర,బుధ | శని |
| కన్య | శుక్ర,బుధ | శని | గురు,రవి | చంద్ర,కుజ |
| తుల | శని | శుక్ర,బుధ | చంద్ర,కుజ | గురు,రవి |
| వృశ్చిక | చంద్ర,గురు | కుజ,రవి | శని | శుక్ర,బుధ |
| ధనూ | రవి,గురు | కుజ,చంద్ర | బుధ,శని | శుక్ర |
| మకర | శుక్ర,శని | బుధ | రవి,కుజ | చంద్ర,గురు |
| కుంభ | శుక్ర | శని,బుధ | చంద్ర,కుజ,గురు | రవి |
| మీన | కుజ,గురు,చంద్ర | రవి | బుధ | శని,శుక్ర |

**గమనిక– మొదటి వరుసలో మేషాదిగా చెప్పబడిన అతిశుభులు రెండువ వరుసలో శుభులలో మీనాదిగా చెప్పబడ్డారు. అలాగే 3వ వరుసలోని పాపులు 4వ వరుసలో మీనాదిగా మారడం గమనించవచ్చును.**

**ద్వాదశానా మతిశుభాః క్రమా దేవం శుభాఅపి**
**పాపినాశ్చాతి పాపాశ్చ లగ్నానాం సముదాహృతాః ॥ 8 ॥**

తా॥ మేషాది మీనరాశివరకు గల లగ్నములకు అతిశుభ, శుభ, పాప, అతిపాప వివేచనమును క్రమముగా పైని చూపడమైనది.

**యథాపూర్వం బలం జ్ఞేయం ప్రతియోగం సుపర్వాణాం**
**యథోత్తరం చ దైత్యానాం తారతమ్య పరీక్షణే ॥ 9 ॥**

తా॥ పూర్వోక్త విధముగా బలనిర్ణయము చేయునపుడు శుభులకు పాపులకు ఉత్తరోత్తర క్రమమును గ్రహించవలెను. అనగా శుభులలో బుధునికంటే, పూర్ణ చంద్రుడు, శుక్రుడు, గురుడు వరుసగా బలవంతులు. పాపులలో క్షీణచంద్రుడు, పాపయుత బుధుడు,రవి, శని, కుజుడు వరుసగా బలవంతులు. శుభులలో గురుడు పాపులలో కుజుడు సర్వోత్తమ బలుడు.

**శనిశుక్ర బుధర్ క్షాణా మితరే దైత్య సంజ్ఞికాః**
**త్రయస్తే చేతరర్ క్షాణాం దైత్య భిన్నా దివౌకసః ॥10॥**

తా॥మకర-కుంభ, వృషభ-తుల, మిథున-కన్యలగు)శని, శుక్ర, బుధక్షేత్రముల కితర గ్రహములగు (రవి, కుజ,చంద్ర,గురులు)దైత్యసంజ్ఞగల పాపులగుదురు. అట్లే రవి,కుజ,చంద్ర,గురు క్షేత్రములగు (సింహ, మేష-వృశ్చిక, కర్కట, ధనూ-మీన) శని, శుక్ర, బుధులు దైత్యసంజ్ఞగల పాపులగుదురు. కాని మొదటి వర్గమునకు, రెండవ వర్గమునకు భిన్నులైన గ్రహములు దేవతాసంజ్ఞగల శుభులవుతారు.

(అనగా శని,శుక్ర,బుధ క్షేత్రములకు రెండవవర్గులో చెప్పబడిన శని,శుక్ర, బుధ గ్రహములు సజాతీయులై శుభులగుదరనియు, అదే విధముగా మొదటివర్గ ములో చెప్పబడిన రవి,కుజ,చంద్ర,గురులు రెండవ వర్గులో చెప్పబడిన క్షేత్రములకు సజాతీయులై శుభులగుదురనియు భావము.

(తృతీయాధ్యాయం సమాప్తం)

## 4. సంబంధ, స్థితి విచారణాధ్యాయము

**ఫలే తమోగ్రహౌ స్యాతాం సంబద్ధ గ్రహ సన్నిభౌ**
**తదేభావే సమారూఢ రాశి నాయక సన్నిభౌ ॥ 1 ॥**

తా. ఫలము నిచ్చుటలో రాహుకేతువులే గ్రహ సంబంధం అనగా దృష్టి, సంయోగ ములు పొందుదురో ఆ గ్రహఫలము నిత్తురు. ఇతర గ్రహముల సంబంధం వారికి లేనప్పుడు వారుండు రాశ్యాధిఫలితమును ఇచ్చెదరు. (కాళిదాసు రాహుకేతువులను *స్వతంత్రులుగా నెంచి 7. 8(9), 10, 11స్థానములందు రాహువు, 3వ స్థానమునందు కేతువనియు చెప్పెను.)*

**త్రయాణాం పునరాధ్యానాం ద్వయోరతి శుభాదిషు**
**సంయోగేష్వవరో యోగీ శ్రేషః స్యాదర సంజ్ఞక ॥ 2 ॥**

తా. అతి శుభులకు పాపులతో సంయోగము కల్గినప్పుడు అతి శుభులు పాప గ్రహఫలితమును, పాపులతి శుభగ్రహఫలమును ఇచ్చెదరు. అట్లే అతిశుభులు శుభ గ్రహ సంయోగమందు అతిశుభులు శుభగ్రహ ఫలితమును నిచ్చెదరు. శుభులు అతి శుభగ్రహఫలితములు ఇచ్చెదరు.

**శ్రీ కేశవేశయోర్యోగే దేవయోర్యోగినా వుభౌ**
**దైత్య రంధ్రాంత్యపత్యోశ్చ యోగే ద్వావశి యోగినౌ ॥ 3 ॥**

తా. దేవసంజ్ఞ గల (అనగా అతిశుభులైన లేదా శుభులైన) లక్ష్మీ, విష్ణుస్థానాధి పతుల సంయోగము పొందినప్పుడుభయులు యోగకారకులగుదురు. అట్లే దైత్యసంజ్ఞ గల (అతిపాపులైన లేదా పాపులైన) అష్టమ వ్యయాధిపతులు సంయోగమైనప్పుడు ఉభయులును గూడా యోగకారకులగుదురు.

**సర్వే భావాధిపతయః సవర్ణ గృహ సంస్థితే**
**సవర్ణస్యచ సంయోగ త్రృభవిష్యంతి యోగినః ॥ 4 ॥**

తా. సర్వభావాధిపతులు తమ స్వజాతీయుల యొక్క క్షేత్రములందున్నపుడు కాని, స్వజాతీయ గ్రహముల యొక్క సంయోగము పొందినప్పుడు కాని యోగకారకు లగుదురు.

**సర్వేష్వేతేషు యోగేషు పూర్ణలోకే పరస్పరం**
**బలావరో భవేద్యోగి బలాధిక మదూషయన్ ॥ 5 ॥**

తా. పైని చెప్పబడిన యోగము లన్నింటియందును ఆయా యోగగ్రహములకు పరస్పర పూర్ణదృష్టి ఉన్నయెడల వారిలో బలహీనుడు బలవంతుని యోగమునకు అడ్డంవచ్చి దానిని పాడుచేయడు సరికదా తానుకూడా యోగము ఇచ్చును.

**సర్వేష్వేతేషు యోగేషు జ్యాయాసా పూర్ణమీక్షితః**
**తమపశ్యన్ కనీయాంశ్చ యోగీతి సముదాహృతః ॥ 6 ॥**

తా. పైని చెప్పబడిన యోగములన్నిటియందు శ్రేష్ఠమైన ఒక గ్రహముయొక్క పూర్ణదృష్టిని పొందినట్టి అల్పగ్రహము (శుభత్వ మల్పముగానిచ్చు గ్రహము) తానా శ్రేష్ఠగ్రహమును తిరుగ వీక్షించకున్నను (అనగా పరస్పరదృష్టి లేకున్నను) యోగము నిచ్చును.

**దేవ శ్రీహరిపౌ విష్ణు దేవశ్రీ గౌతు యోగినౌ**
**దైత్యః పద్మాలయానాథః దామోదరస్థితః ॥ 7 ॥**

తా. దేవసంజ్ఞగల లక్ష్మీ, విష్ణు స్థానముల యొక్క అధిపతులుభయులు పరివర్తన చే విష్ణులక్ష్మీస్థానములను పొందినపుడు ఇరువురు యోగకారకులగుదురు. (*లక్ష్మీ స్థానాధిపతి దైత్యగ్రహమైనను విష్ణుస్థానము నా పరివర్తనము పోంది శుభుడగును.*)

**అతిపాపాతి శుభయో ర్యోగే పూర్వః శుభోభవేత్**
**అపరో భవితా పాపః సంగజాహి గుణాగుణాః ॥ 8 ॥**

తా. అతిపాప, అతి శుభగ్రహములకు సంయోగమున్నపుడు మొదట చెప్పబడిన అతిపాపి శుభుడగును. తరువాత చెప్పబడిన అతిశుభుడు పాపియగును. ఏలననగా సంగమము వలన నొకరి గుణమింకొకరికి సంక్రమించును

(*2వ శ్లోకములో అతి శుభులకు పాప, శుభగ్రహములతో గలుగు సంయోగ ఫలితము చెప్పవలెను. ఇక్కడ అతిపాపాతిశుభుల సంయోగఫలము చెప్పి తరువాత*

*శ్లోకములో అతిపాపికి పాప శుభుల సంయోగము చెప్పుచున్నారు.)*

**యుక్తశ్శుభేవాతిపాపః పాపేనచ శుభోభవేత్**
**సపాతయే చ్ఛుభం నీచై రుచ్చై రారోహయేత్పరం ॥ 9 ॥**

తా. అతిపాపికి సాధరణ పాపగ్రహముతోగాని శుభగ్రహముతో గాని సంయోగమైనప్పుడు అతిపాపి శుభము చేయను. (అయితే శుభగ్రహ సంగమమందు శుభ గ్రహము నతడు నీచమైన అతిపాప స్థితికి దించివేయుటకు బదులు ఉచ్చస్థితికి (అనగా నతిశుభస్థితికి హెచ్చించును.)

*(పూర్వశ్లోకములో చెప్పబడినట్లు ఇక్కడ సంయోగమువలన అన్యోన్యగుణ సంక్రమణముండదు.)*

**త్ర్యాదీనాం భిన్న జాతీనాం యోగే జ్యాయాన్పతత్యథః**
**కనీయాంచ్ఛుభ సంజ్ఞస్స్యా ద్యోగినో మధ్య సంస్థితాః ॥10 ॥**

తా. భిన్నజాతులైన మూడు గ్రహముల సంయోగము కలిగనప్పుడు ఫలప్రద విషయములో శ్రేష్ఠమైన గ్రహమునకు నీచఫలితము, కనిష్ఠమైనదానికి శుభత్వము ప్రాప్తించి, మధ్యరకమైన మూడవ గ్రహము యోగము నిచ్చునదగును.

(చతుర్థాధ్యాయము సమాప్తము)

## 5. మారక విచారణాధ్యాయము

**స్వయం లగ్నారిపతయ స్తథా లగ్నారి సంస్థితాః**
**లగ్నారిప యుతా దైత్యా మారకాఃస్యుర్యథోత్తరమ్ ॥ 1 ॥**

తా. లగ్నమునకు శత్రుస్థానములగు 12,2,7ల యొక్క అధిపతులు, ఆ స్థానము లందున్నవారు, ఆ స్థానాధిపతులతో గూడినవారు- ఈ మూడు రకములవారును దైత్యులగుచు, ఒకరికంటె నొకరు క్రమముగా ప్రబల మారకులగుదురు.

**వ్యయేశా ద్విత్తపస్తస్మా త్సప్తమేశోఽధికోఽసురః**
**ఏవం స్థితౌ చ సంసర్గే నిమిత్త బల నిర్ణయః ॥ 2 ॥**

తా. వ్యయాధిపతికంటే ద్వితీయాధిపతి బలవంతుడు, ద్వితీయాధిపతికంటే సప్త మాధిపతి బలవంతుడు. ఈ ప్రకారముగానే ఆ మూడు స్థానములందున్నవారికి, ఆ స్థానాధిపతులతో గూడినవారికి క్రమోన్నతి బలమును(మారకంలో)నిర్ణయించ వలెను.

**తత్ర స్థితేషు దైత్యేషు బలీ నైసర్గికః శుభః**
**తేన యుక్తేషు దైత్యేషు పాపోనైసర్గికో బలీ ॥ 3 ॥**

తా. పైని చెప్పబడిన 12,2,7 స్థానములందు స్థితిచే మారకులగుచున్న(దైత్యు లగుచున్న)వారిలో నైసర్గికముగా శుభుడైనవాడు బలవంతుడగును.(పూర్వ శ్లోకము లోని క్రమోన్నతిని అతిక్రమించి ఈ గ్రహము బలవంతుడగునని భావము). అట్లే ఆ స్థానాధిపతులతో గూడి మారకులగుచున్న గ్రహములలో నైసర్గికపాపి బలవంతుడగును.

**అలాభే హంతుర్దైత్యస్య దేవా మారక లక్షణాః**
**ప్రాగుక్త తారతమ్యేన కల్ప్యంతాం జీవితాసహాః ॥ 4 ॥**

తా. మారకులగుచున్న నైసర్గిక పాపుల దశ రానప్పుడు మారక లక్షణములు గలిగిన శుభులే పూర్వోక్త బలతారతమ్యము చొప్పున మారకులగుదురని చెప్పవలెను.

**అత్రాతి శుభతఃశ్రేష్ఠ మష్టమేశం ప్రచక్షతే**
**ఉపహంతాఽఽయురీత్సహి ప్రాయేణ నాయుషః ॥ 5 ॥**

తా. మారకవిషయములో అష్టమాధిపతిని అతి శుభునికంటెను శ్రేష్ఠునిగా చెప్ప వలెను. ఏలననగా, ఆ గ్రహము ఆయుస్థానాధిపతి అయిన కారణంగా ఆయుర్భంగం కావింపడు.

**వక్ష్యమాణేన మార్గేణ దీర్ఘ మధ్యాల్పకాయుషః**
**నిశ్చిత్వ జాతకాన్పశ్చా త్కుర్యాన్మారక నిర్ణయమ్॥**

తా. ముందు చెప్పబోవు ఆయుర్నిర్ణయ మార్గముల ననుసరించి దీర్ఘ, మధ్య, అల్పాయుర్దాయములను గుర్తించి, జాతకుని మారక నిర్ణయము చేయవలెను.

(పంచమాధ్యాయము సమాప్తము)

## 6. దశాంతర్దాశాధ్యాయము

**శ్రీప్రదాః స్వదశాకాలే వ్యయేశో లాభనాయకః**
**భోగేశ్వరో విష్ణుపతి ర్హితత్వేతు యథోత్తరం ॥ 1 ॥**

తా. వ్యయ, లాభ స్థానాధిపతులు(12,11), భోగస్థానాధిపతులు(2-4-10), విష్ణుస్థానాధిపతులు(5,9)-వీరు తమ ఆధిపత్య సంయోగములచే శుభులైనప్పుడు తమతమ దశాకాలములందు అనులోమ క్రమమున నొకరికంటే నొకరు మించి ఐశ్వర్యము నిత్తురు. (అనగా లాభ, వ్యయాధిపతులలో భోగాధిపతులకు సంయోగ మైనప్పుడు భోగాధిపతులు అధికైశ్వర్యమును ఇచ్చెదరు. అట్లే మొదటి రెండు తెగలతో విష్ణుస్థానాధిపతుల సంయోగమైనప్పుడు విష్ణు స్థానాధిపతులు అధికైశ్వర్యమును ఇచ్చె దరని భావము).

**శ్రీహరాః స్వదేశకాలే విష్ణీ్వశో భోగనాయకః**
**అంత్యేశాయేశ రంధ్రేశా అహితత్వే యథోత్తరం ॥ 2 ॥**

తా. పూర్వశ్లోకములోని క్రమమును తిరుగవేసి 5,9;2,4,10;12,11(8)స్థానాధి పతులు తమ ఆధిపత్య సంయోగముచే పాపులైనపుడు తమ తమ దశాకాలములందు అనులోమ క్రమముగా ఒకరికంటే నొకరు మించి ఐశ్వర్యమును హరింతురు. (అనగా ధననష్టమును కలిగింతురు).

**దశాను దేహ సుఖదాః షష్ఠేశాస్తేశ వీర్యపాః**
**రంధ్రేశో లగ్ననాథశ్చ హితత్వేతు యథోత్తరం ॥ 3 ॥**

తా. 6,7,3,8,1 స్థానాధిపతులు(లగ్నమునుండి) తమ ఆధిపత్య సంయోగము వలన శుభులైనచో వారి స్వదశాకాలములందు అనులోక క్రమమున నొకరికంటే నొకరు మించి దేహసౌఖ్య కారకులగుదురు.

**దశాను దేహ కష్టాయ లగ్నేశః శత్రునాయకః**
**తథాలగ్న ద్విషాం నాథా అహితత్వే యథోత్తరం ॥ 4 ॥**

తా. 1,6,12,2,7 స్థానముల అధిపతులు తమ ఆధిపత్య సంయోగమువలన పాపులైనచో వారి స్వదశా కాలమునందు అనులోమ క్రమమున నొకరికంటే నొకరు మించి దేహకష్టములకు కారకులగుదురు.

**ఆగతౌజాః మరోదేయం స్వజాతీయ భుక్తిషు**
**ఫలం దద్యాద్గతౌజాస్తు భిన్న జాతీయ భుక్తిషు ॥ 5 ॥**

దేవసంజ్ఞ కల గ్రహము(అనగా శుభగ్రహములు) ఆగతౌజుడైనచో (అనగా గతించని ఓజస్సు కలవాడైనచో, అనగా ఆగంతుకమైన దృష్టి–సంయోగ–పరివర్తనా దులచే పాపసంబంధము చెందక యథా ఓజస్సు లేదా బలము కలిగినవాడైనచో) అతడిచ్చు శుభఫలమును తన మహాదశలో సజాతీయ శుభులయొక్క అంతర్దశలందు ఇచ్చును. ఆ శుభగ్రహమే గతౌజుడైనచో(అనగా ఆగంతుక పాపసంబంధముచే క్షీణ బలము కలవాడైనచో) ఆతడా సంబంధముచే నిచ్చు పాపఫలితమును తనకు భిన్న జాతీయుల(పాపుల) భుక్తులందిచ్చును.

(పాపసంబంధంలేని శుభగ్రహము తన శుభఫలితమును తన మహాదశలో వచ్చు సజాతీయ గ్రహదశలందు యిచ్చుననియు, పాప సంబంధము కలిగిన శుభ గ్రహమా పాపఫలితమును తనకు భిన్న జాతీయులైన పాపుల భుక్తులందు ఇచ్చును.)

**ఆగతౌజాః ఫలందైత్యో భిన్నజాతీయ భుక్తిషు**
**దేయం దద్యాద్గతౌజాస్తు స్వజాతీయ భుక్తిషు ॥6 ॥**

తా. దైత్య(పాప)గ్రహము అగతౌజుడైనచో(అనగా నాగంతుక శుభగ్రహ సంబంధములేనివాడై తన పాపబలమందు క్షీణించకయున్నచో)అతడిచ్చు పాపఫలమును తన మహాదశలో తనకు భిన్నజాతీయులైన శుభులు అంతర్దశలందిచ్చును. ఆ దైత్యగ్రహమే శుభగ్రహ సంబంధము వలన గతౌజుడైనచో (పాపత్వమందు బలము తగ్గినవాడని, పూర్తిగా పాపక్షయమైనవాడు తరువాత శ్లోకములో చెప్పబడును). అతడా సంబంధం వలన నిచ్చు శుభఫలమును తనకు సజాతీయులైన పాపులంతర్దశలందిచ్చును.

**యేన శ్వమోజోదైత్యస్య విహన్యేత సుపర్వణా**
**తస్యాపి భుక్తౌ ఫలదః స్వజాతీయ భుక్తివత్ ॥ 7 ॥**

తా. ఏ దేవగ్రహముచే దైత్యగ్రహము యొక్క స్వకీయ ఓజస్సు నాశనము చేయ బడుచున్నదో-అనగా పాపగుణము పూర్తిగా క్షయము బొందుచున్నదో- ఆ దేవతా గ్రహముయొక్క అంతర్దశాభుక్తియందు శుభఫలమును మహాదశానాథుడైన దైత్యగ్రహము తన సజాతీయ పాపగ్రహముల యొక్క ఫలమును వార్తి భుక్తికాలమందు దిచ్చునట్లే ఇచ్చును( ఇక్కడ పోలిక పూర్వశ్లోకములోని గతౌజ దైత్యగ్రహముతో చేయబడినట్లు గ్రహించవలెను.

**అగతౌజాః ఫలందేవో భిన్న జాతీయ భుక్తిషు**
**మిశ్రం దద్యాద్గతౌజాస్తు స్వ సజాతీయ భుక్తిషు ॥ 8 ॥**

తా. ఆగంతుక దృష్టి సంయోగాది పాపసంబంధములేమిచే ఆగతౌజుడగు దేవ గ్రహము తన మహాదశలో భిన్నజాతీయ పాపగ్రహముల అంతర్దశా భుక్తులందు మిశ్రమఫలము నిచ్చుచుండును. ఆ దేవగ్రహమే గతౌజుడై శుభత్వమందు క్షీణించి నపుడు తన సజాతీయ శుభుల భుక్తులందును మిశ్రమఫలమిచ్చును. (5వ శ్లోకములో అగతౌజుడైన దేవగ్రహము తన సజాతీయుల భుక్తియందు శుభఫలము నిచ్చునని చెప్పబడెను. భిన్నజాతీయుల భుక్తులందిచ్చు ఫలము మిశ్రమమని యిక్కడ వచింప బడెను. అట్లే గతౌజుడైన దేవగ్రహము భిన్నజాతీయుల భుక్తులందు పాపఫలితమును ఇచ్చునని 5వ శ్లోకములో చెప్పబడి యిచ్చట సజాతీయుల భుక్తులందిచ్చు ఫలము మిశ్రమమని వచింపబడెను. ఇట్లు దేవగ్రహములిచ్చు ఫలవిధానమును ముగించి దైత్యగ్రహములిచ్చు ఫల విధానమును 6 శ్లోకము యొక్క తరువాయిచే తరువాత శ్లోక మందు కవి ముగించుచుండెను.)

**అగతౌజాః ఫలం దద్యాత్ స్వజాతీయ భుక్తిషు**
**మిశ్రం దైత్యో గతౌజస్తు భిన్నజాతీయ భుక్తిషు ॥ 9 ॥**

తా. పాపత్వమును తగ్గించు శుభగ్రహదృష్టి సంయోగములు లేకపోవుటచే ఆగతౌ జుడగు దైత్యగ్రహము తన మహాదశలో సజాతీయపాపుల భుక్తియందు మిశ్రమఫలము నిచ్చుచుండును(6వ శ్లోకములో భిన్నజాతీయుల భుక్తిలందిచ్చు ఫలమునుజెప్పి తదితర భుక్తులందిచ్చు ఫలమును చెప్పి ఆ గతౌజదైత్యులిచ్చు ఫల విధానమును కవి పూర్తి చేసెను. అట్లే గతౌజదైత్యులిచ్చు ఫలవిధానము తరువాత వాక్యములో పూర్తి గావించ బడుచున్నది. )అట్లే శుభసంబంధము వలన పాపత్వము క్షీణించగా గతౌజుడగు దైత్యుడు

తన మహాదశలో భిన్న జాతీయుల భుక్తులందు మిశ్రమఫలము నిచ్చుచుండును.

(దేవ దైత్యగ్రహములు ఇతరగ్రహ సంబంధము వలన ఫలవిధానమందు గల్గు వ్యత్యాసము లింతసులభముగా నితర గ్రంథములందు దెచ్చటను చెప్పబడలేదు.)

**పాపత్వమోజసోహానిః శుభాతిశుభయో రిహ**
**శుభత్వమోజసోహానిః తథా పాపాతి పాపయోః ॥10॥**

తా. శుభాతి శుభగ్రహములకు పాపులకు పాపుల సంయోగాదికముచే పాపము సంక్రమించుటయే వారి యోజస్సులకు గలుగుహానిగా నీ శాస్త్రమందు చెప్పబడెను. అట్లే పాపాతి పాపులకు శుభ సంయోగాదికముచే శుభత్వము సంక్రమించుటయే వారి యోజస్సులకు హానియనియు చెప్పబడెను.

**అన్యోన్య భుక్తౌ శుక్రార్కీ విశేషేణ ఫలప్రదౌ**
**సురౌ యది, సురారీ చేత్ కదాచిన్నా శుభప్రదౌ ॥11॥**

తా. శని, కుజులు శుభులైనచో వారి పరస్పర దశాంతర్దశలలో విశేషశుభ ఫలమునిత్తురు. వారు పాపులైనచో వారి పరస్పర దశాంతర్దశలందెప్పుడును పాపఫలము మాత్రమీయరు. (ఇక్కడ ఇరువురుకు శుభత్వము కాని పాపత్వముకాని యుండవలెను)

**యోగీ నిమిత్త భూతస్య భుక్తౌ శ్రేయః ఫలప్రదః**
**యోగీ మధ్యగతత్పక్ష దశాశ్రేయః ఫలప్రదః ॥12॥**

తా. యోగకారకగ్రహము తన మహాదశయందు తానిచ్చు యోగమునకు (సంయోగాదికముచే) కారణభూతమైన గ్రహముయొక్క అంతర్దశాభుక్తియందాయోగమునిచ్చును.

(ఒక రాశియందు యోగకారకగ్రహ మొక్కటియై, యితర సంబంధము లేక యున్నప్పుడా రాశి కిరుపక్కల నుండు గ్రహములను కొందరు యోగకారణభూతులనిరి) అయితే, యోగకారకు లిద్దరున్నచో (వేరురాశులందు) వారిద్దరికి మధ్యనున్న గ్రహము, వాని మిత్రుడును తమ దశలందు శుభఫలముల(యోగము)నిచ్చెదరు. మధ్యగతుడు, పక్షుడు యోగకారణభూతులగుదరని భావము).



**యశ్శుభో వ్యతిరేకేణ యః పాపోవ్యతిరేకతః**
**ఫలం వదేత్తద్దశయోః భుక్తినాథామసారతః ॥13॥**

తా. ఏ గ్రహము వ్యతిరేకముచేత శుభుడో, ఎవడు వ్యతిరేకముచేత పాపుడో

(2వ అధ్యా,7,8శ్లో॥ చౌన రవి,చంద్రులు వృషభ,తులలకు పాపులు, చంద్రుడు ధను స్సింహములకు,శని మిధున-కన్యా-కుంభములకు వ్యతిరేక శుభులగుదురు. వారి దశలలో వారి ప్రమేయము లేకుండగానే వారి అంతర్దశానాధులను అనుసరించి ఫలమును చెప్పవలెను. (అనగా అట్టి దశానాథుల నిమిత్తము లేకుండ అంతర్దశా నాధులు స్వతంత్రించి ఫలముల నిత్తురని భావము.

**ఫల మిష్ట మనిష్టంవా దేవోః దైత్యో థవా గ్రహా**
**స్వభుక్తౌ న దిశేన్నృణాం మారకస్తు దిశేత్క్వచిత్ ॥14॥**

తా.శుభగ్రహము శుభమునుగాని, పాపగ్రహము పాపమునుగాని తన మహా దశలో తన అంతర్దశయందు చేయును. ఆ శుభుడు కాని పాపుడుకాని మారకుడైనచో అప్పుడు మాత్రమెప్పుడైన తన దశలో తన భుక్తియందు మారకఫలము నిచ్చును.

**ఆయుర్విచార్య ప్రథమం తారతమ్య మనంతరం**
**నిర్ణీతం మారకం బ్రూయాద్ధంతారం దైత్య భుక్తిషు ॥15॥**

తా.దీర్ఘ, మధ్య, అల్పములనెడి తారతమ్యులతో గూడిన ఆయుర్విచారణను మొదటచేసి, పిదప ఆయుర్భంగమును జేయుమారకుని నిర్ణయించి, అటు పిమ్మట ఆ మారకుని మహాదశలో పాపుల అంతర్దశాభుక్తులందు మారకుడగునని చెప్పవలెను.

**నిర్ధార్య సూక్ష్మయా బుద్ధ్యా తానుచైకాం వినిర్దిశేత్**
**ఆయుర్మానా విరోధేన తారతమ్యం విచింతయేత్ ॥16॥**

తా.దైవజ్ఞుడు సూక్ష్మబుద్ధితో పైని పేర్కొనబడిన విధమున దశాంతర్దశలలో ఆయుః ప్రమాణమునకు విరోధము గాకుండునట్లుగా మారకుల బలతారతమ్యమును విచారించిన పిమ్మట మారక సమయమును నిర్ణయించవలెను.

(షష్ఠాధ్యాయము సమాప్తము )

## 7. భావాధ్యాయము

**అధ్యాయే యత్ర యాత్రాస్మిన్నామనీ శుభపాపయోః**
**తత్ర తత్ర నిసర్గేణ త్వధ్యాహార్యం విచక్షణైః** ॥ 1 ॥

తా. ఈ అధ్యాయమందు ఎచ్చటెచ్చట శుభగ్రహ, పాపగ్రహముల పదనామము వచ్చునో, అచ్చట 'నైసర్గిక' అనే విశేషణము చేర్చి నైసర్గిక శుభుడని, నైసర్గిక పాపియని యధ్యాహార్యముగా గ్రహించవలెను.

**ప్రత్యుః ప్రతీపకమలా కోణ స్వరోక్షచ్చ సంస్థితిః**
**సంబంధశ్చేశ శుభయో ర్భావస్య బలవృద్ధయే** ॥ 2 ॥

తా. భావాధిపతికి 3,7,11;4,10;1,5,9 (ప్రతీపములు, లక్ష్మీ స్థానములు, కోణములు)-వీనియందు స్థితి, లేదా స్వక్షేత్రమందు స్థితి, లేదా ఉచ్చస్థితి ప్రాప్తించినప్పుడా భావమునకు బలవృద్ధి యగును. ఏ భావమునకైనా ఆ భావాధిపతితో గాని నైసర్గిక శుభులతో గాని సంబంధం కలిగినను, ఆ భావము యొక్క బలము హచ్చును.

**తారతమ్యం ప్రతీపదౌ మిత్రా మిత్రర్క్ష [illegible]తనాత్**
**తేభ్యః స్వర్క్ష స్తతస్తుంగః సంబంధో బలవాం స్తతః** ॥ 3 ॥

తా. పూర్వశ్లోకములో చెప్పబడిన ప్రతీప, లక్ష్మీ,కోణస్థానములందుండు మిత్ర, శత్రు క్షేత్రములవల్లను తారతమ్యము భావబల నిర్ణయము కొఱకూహించవలెను. ఆ చెప్పబడిన స్థానములందు భావాధిపతి పొందు స్థితి బలకరము, భావాధిపతి ఉచ్చ యందుండుట మరియు బలకరము, భావమునకు నైసర్గిక శుభ-పాప సంబంధము అన్నిటికంటే బలకరము.

**అనీశ పాపసంబంధః పత్యుర్నీచ త్రికస్థితా**
**భావస్య బలనాశాయ భవతీతి వినిర్ణయః** ॥ 4 ॥

తా. ఆయా భావముల కధిపతులు కాబట్టి నైసర్గిక పాపులతో సంబంధం, వాని కధిపతులైనట్టి వారికి నీచ, షష్ఠాష్టమ, వ్యయస్థితులు క్రమముగా భావబలమును నశింపచేయునని నిర్ణయించవలెను.

**సామాన్యరీత్యా భావనామేవం ప్రోక్తం బలాబలమ్**
**ఆయుషో నిర్ణయం వక్ష్యే విద్వత్ప్రీత్యై విశేషతః ॥ 5 ॥**

తా. సామాన్యరీతి నిట్లు భావముల బలాబలములు చెప్పబడెను. ఇంక విద్వాంసుల ప్రీతికొరకు ఇచ్చట విశేషించి ఆయుర్నిర్ణయమును గురించి చెప్పెదను.

**లగ్న రంధ్ర శశాంకానాం బలే నాయుర్విచిన్తయేత్**
**త్రిష్వాయుర బలేష్వల్పం మధ్యాల్పం హీనయోర్ద్వయో ॥ 6 ॥**

తా. లగ్నాష్టమ స్థానముల యొక్క చంద్రుని యొక్క బలము అనుసరించి ఆయుర్నిర్ణయము చేయవలెను. ఇందులో లగ్నాష్టమ స్థానాధిపతులు, చంద్రుడు కూడా దుర్బలులైనప్పు అల్పాయువనియు, నిర్దరు మాత్రమే దుర్బలురైనపుడు మధ్యాయువు.

**ఉభయోర్బలినోః శేషే హీనేస్యా న్మధ్య దీర్ఘకమ్**
**శేషేత్వహీనే దీర్ఘాల్పం సర్వేషాం పరమం బలే ॥ 7 ॥**

పూర్వశ్లోకములో చెప్పబడిన లగ్నాష్టమాధిపతులు, చంద్రుడు ఈ ముగ్గురులో నిద్దరు బలవంతులు, ఇద్దరు బలవంతులు, ఒకడు బలహీనుడైనచో మధ్య దీర్ఘాయుర్దాయము, ఆ మూడవవాడు బలుడు కాక బలహీనుడునుగాక సామాన్యుడైనచో దీర్ఘాల్పాయువని, ముగ్గరు బలవంతులైనచో దీర్ఘాయువని చెప్పవలెను.

*(మేషము కాని, తులకాని లగ్నమైనచో లగ్నాష్టమాధిపతులు లొక్కరే అవుతారు. అప్పుడు అష్టమాధిపతిని చంద్రలగ్నమునుండి గైకొనుచ సంప్రదాయము).*

(ఈ అధ్యాయమునందొక పాఠముగా దిగువ ఒక శ్లోకము కలదు)

**యథైవ లగ్నాద్భావానాం సర్వేషా మన్వవేక్షణమ్**
**తథాభవతి చంద్రాచ్చ సూర్యాచ్చేత్యపరే జగుః ॥ 8 ॥**

తా. లగ్నమునుండి ఏ విధముగా సర్వభావములు పరీక్షించుచున్నారో, అదే విధముగా కొందరు చంద్రలగ్నమునుండి, మరికొందరు సూర్యునినుండి భావఫలములు చెప్పుచున్నారు.

# 8. యోగాధ్యాయము

**ఆరంధ్రాయాశ్లేష దోషో ధర్మకర్మాధి నాయకౌ:**

**రాజయోగకరౌ స్యాతాం సంబంధా త్పరివర్తనాత్ ॥ 1 ॥**

తా. 8,11 స్థానాధిపతులతో కూడినట్టి, ఆ రెండు స్థానములందును స్థితి పొందినట్టి భాగ్యరాజ్యాధిపతులు పరస్పర సంబంధము వల్లను, పరివర్తన వల్లను రాజయోగమును చేయుదురు. (*అష్టమ లాభస్థానములందు ఆధిపత్యము అశుభము కావునా రాజయోగ ప్రాప్తికి ఆ అధిపతుల సంబంధము ఉండరాదు. కేంద్రకోణాధిపతులకా సంబంధం లేనప్పుడు భాగ్యరాజ్యములందు స్థితి ప్రాప్తించినచో రాజయోగముండును.)*

**లగ్నేశ యోగదృష్టిభ్యాం యోగోఽయం ప్రబలోభవేత్**

**రంధ్రేశ్వరస్య దైత్యస్య యోగేన శిథోలో భవేత్ ॥ 2 ॥**

తా. లగ్నాధిపతియొక్క దృష్టివలన, సంయోగము వలన పూర్వశ్లోకమందు చెప్ప బడిన రాజయోగము ప్రబలమైనదగును. అట్లే అది అష్టమాధిపతియైన పాపుని యొక్క సంయోగము వలన శిథిలమైపోవును.

**అషష్ఠాయాశ్లేష దోషా బుద్ధి కర్మాధినాయకౌ।**

**రాజయోగకరౌ ప్రాగ్వత్సంబంధా త్పరివర్తనాత్ ॥ 3 ॥**

తా. 6,11స్థానాధిపతులతో కూడినట్టి, ఆ రెండు స్థానములందును స్థితి బొంద నట్టి పంచమ భాగ్యాధిపతులు పరస్పర సంబంధ పరివర్తనముల వలన రాజయోగము చేయుదురు.(*ఈ రాజయోగము 1వ శ్లోకములోని రాజయోగముకంటే తక్కువది.)*

**అయంచ యోగో లగ్నేశ దృగ్యోగాభ్యాం బలీభవేత్**

**షష్ఠేశ్వరస్య దైత్యస్య యోగేన శిథిలో భవేత్ ॥ 4 ॥**

తా. ఈ యోగము(3వ శ్లోకము) లగ్నాధిపతియొక్క దృష్టి సంయోగము వలన బలప్రదమగును. అలాగే 6పతి పాపుని సంయోగముచే శిథిలమగును.

**అవ్యయా యాశ్లేషదోషౌ లగ్న కర్మాధి నాయకౌ**
**రాజయోగకరౌ ప్రాగ్వత్సంబంధా త్పరివర్తనాత్ ॥ 5 ॥**

తా. 12,11 స్థానాధిపతులతో కూడినట్టి, ఆ రెండుస్థానములందును స్థితిబొంది నట్టి లగ్న రాజ్యాధిపతులు పరస్పర సంబంధము వలన, పరివర్తనము వలనను రాజ యోగమును చేయుదురు. (*ఈ యోగము 3వశ్లోకము కంటే తక్కువది*).

**విష్ణీశయోగ దృష్టిభ్యాం యోగోఽయం ప్రబలోభవేత్**
**వ్యయేశ్వరస్య యోగేన యోగోఽయం శిథిలోభవేత్ ॥ 6 ॥**

తా. ఈ యోగము(5వ శ్లోకము) విష్ణుసానాధి(5,9)పతుల దృష్టి సంయోగము వలన ప్రబలమైనదగును. అట్లే అది వ్యయాధిపతి సంయోగమువలన శిధిలమగును.

**రాజయోగః పరశ్చంద్రో యది సర్వగ్రహేక్షితః**
**సర్వగ్రహేక్షితం రాజ్యం యది యోగోఽన్య ఉచ్యతే ॥ 7 ॥**

తా. చంద్రు అన్ని గ్రహములచే చూడబడిన ఎడల శ్రేష్ఠమైన రాజయోగము పట్టును. అట్లే రాజ్యస్థాన మన్నిగ్రహములచే చూబడినప్పుడు వెరొ రాజయోగమగును.

**విద్యతే యస్యభావస్య సర్వగ్రహ విలోకనమ్**
**యోగస్తద్భావ సంబంధీ భవేత్కశ్చిదనుత్తమః ॥ 8 ॥**

తా. ఏ భావమునకు సర్వగ్రహ దృష్టి ఉండునో ఆ భావమునకు సంబంధించి ఒక రాజయోగము ఉత్తమమైనది కాకపోయినను కలుగును. (సర్వగ్రహదృష్టి లేకున్నను *పంచగ్రహదృష్టి ఇట్టి యోగమునకు చాలునని కొందరి అభిప్రాయము*).

**సర్వైః నైసర్గిక శుభైః త్రిషడయాస్తదశ స్థితైః**
**యోగః నూపచయోనామ ధనవృద్ధి కరోనృణామ్ ॥ 9 ॥**

తా. నైసర్గిక శుభగ్రహములన్నియు 3,6,10,11 స్థానములందున్న ఎడల 'ఉప చయ'మనే పేరుగల మరొక యోగము పట్టును. అది మానవులకు ధనవృద్ధి కరమైనది. (*3,6,11స్థానముల బలమగు పాపగ్రహములు, వానియందు శుభగ్రహములుండుట ధనకారకులగు గురు శుక్రాదులుండుట ధనవృద్ధికి హేతువగును*).

**చంద్రతశ్చేదయం యోగోబుద్ధి వృద్ధికరో భవేత్**
**ధనే వ్యయే చోభయత్ర శ్రీయోగో మంగళాదిభిః ॥10 ॥**

తా. పై యోగమునందు నైసర్గిక శుభులందరు చంద్రునినుండి 3,6,11స్థానము లలో నున్న ఎడల బుద్ధిని వృద్ధిచేయును. చంద్రునకు 2వ రాశిలోగాని, 12వరాశిలో గాని, లేదా 2,12రాశులు రెండింటిలోగాని కుజాది పంచగ్రహములున్నచో(కుజ, బుధ,గురు,శుక్ర,శని) శ్రీయోగమనబడును.(రవి విడువబడివుండడం గమనించవచ్చును

**యోగః కేమద్రుమోనామ గ్రహా భావే ప్రకీర్తితః**
**కేంద్రస్థితే సగ్రహేవా చంద్రేనాయమితి స్థితిః ॥11॥**

తా. చంద్రునికి ఇరువైపులను గ్రహాభావమున్న ఎడల(అనగా గ్రహములు లేని యెడల)కేమద్రుమనెడి దరిద్రయోగము కలుగును. అయితే, ఆ చంద్రుడు కేంద్ర మందున్నను, లేదా ఇతర గ్రహములతో కూడియున్నను కేమద్రుమయోగము పోవును.

**పునశ్చంద్రా త్సపత్నాష్ట రంధ్రస్థై రఖిలైశ్శుభైః**
**నైసర్గికైః భవేచ్ఛ్రేయా నయోగోధికారదః ॥12॥**

తా.నైసర్గిక శుభులందరు మరల చంద్రునినుండి 6,7,8స్థానములందున్న ఎడల శుభకరమైన 'అధియోగ' మనబడును. ఇది అధికారము ఇచ్చునట్టి యోగము.

**త్ర్యాదిభిః తుంగగైః ఖేటైః స్వర్‌క్షస్థైః చతురాదిభిః**
**పంచాదిభిశ్చ సంయుక్తైః యోగా ఐశ్వర్యదాయకాః ॥13॥**

తా.మూడు మొదలుకొని గ్రహములు(అనగా రెండుకు పైని) ఉచ్చయందున్నను, నాలుగు మొదలుకొని గ్రహములు స్వక్షేత్రములందున్నను, అయిదు మొదలుకొని గ్రహములు ఒకే స్థానమందున్నను, అట్టి సన్నివేశములు (రాజయోగములై) ఐశ్వర్య దాయకమగును.

**ఇతి సామాన్యతః ప్రోక్తం శాస్త్రం గంభీరముజ్వలమ్**
**ఉపదేశాయ శిష్యాణాం గోకర్ణే విలసబుద్ధియామ్ ॥14॥**

తా. ఇట్లు సామాన్య సులభపద్ధతిని గంభీరమైనట్టి, యుజ్వలమైనట్టి జ్యోతి శ్శాస్త్రమును గోకర్ణక్షేత్రమందున్న బుద్ధిమంతులైన శిష్యుల కుపదేశించుటకు చెప్పడమైనది.

**(అష్టమాధ్యాయము సమాప్తము)**

**ఇట్లు భగవాన్ శ్రీరమణమహర్షి కంతేవాసియు, వాసిష్ఠ నరసింహశాస్త్రికి పుత్రుడును అగు గణపతిముని విరచితమైన 'హోరానిర్ణయసంగ్రహము' సమాప్తము.**

**-(0)-**

# త్రిభావ ఫలచంద్రిక

అను జ్యోతిష గ్రంథము

(కావ్యకంఠ శ్రీవాసిష్ఠ గణపతిముని విరచితం)

| | |
|---|---|
| 1. ఆయుర్భావము | 30 శ్లోకములు |
| 2. కళత్రభావము | 20 శ్లోకములు |
| 3. పుత్రభావము | 39 శ్లోకములు |
| | -------- |
| మొత్తము | 89 శ్లోకములు |
| | -------- |

# త్రిభావ ఫలచంద్రిక

## (ప్రథమ మయూఖము)

## ఆయుర్భావము

**సవితారం నమస్కృత్య సర్వ ఖేచరనాయకమ్**
**కేరళీయస్య శాస్త్రస్య సారః సంగృహ్యతేమయా ॥ 1 ॥**

తా. సర్వగ్రహములకు రాజైన సూర్యునకు నమస్కరించి, కేరళీయ జ్యోతిశ్శాస్త్రము యొక్క సారమును సంగ్రహించి నేను చెప్పుచున్నాను.

**ఆయుః కళత్ర పుత్రాణాం క్రియతే త్ర విచారణమ్**
**విబుధైరితరే భావాః బోధ్యాః సామాన్యశాస్త్రతః ॥ 2 ॥**

తా. ఆయుర్భావము, కళత్రభావము, పుత్రభావము అను మూడింటి నీగ్రంథము వలన విచారణచేసి పండితులు తెలుసుకొనవలెను. మిగిలిన భావములను సర్వ సామాన్యమువలన తెలుసుకొనవలెను.

**సద్యోఽరిష్ట మరిష్టంచ హీనం మధ్యంచ దీర్ఘకమ్**
**అమితంచేతి షోడాఽయుర్హీనాది త్రితయే దశాః ॥ 3 ॥**

తా. సద్యోరిష్టము(పుట్టినవెంటనే మరణము) అరిష్టము, హీనాయువు, మధ్యమాయువు, దీర్ఘాయువు, అమితాయువు అను ఆరు విధములైన ఆయువులున్నవి. వీనిలో హీన, మధ్య, దీర్ఘములు మాత్రము ఈ గ్రంథమందు చెప్పబడును. వీనిలో హీనమధ్య దీర్ఘములనెడు ఆయుర్దాయములందు దశలను గ్రహించవలెను.

**సద్యోఽరిష్టేష్వరిష్టేచా ప్యమిచేత తథాఽఽయుషి**
**మారకస్యా నపేక్ష్యైవ దశాం జీవిత నిర్ణయః ॥ 4 ॥**

తా. మిగిలిన సద్యోరిష్ట,అరిష్ట,అమితాయుర్దదశలు మూడు తమ ఆయుర్విషయములో మారకగ్రహము యొక్క దశనపేక్షించకుండానే జీవితనిర్ణయము గావింపగలవు.

**సద్యోఽరిష్టా రిష్టయోగా న్వరాహమిహిరోఽభర్తాత్**
**అమితం సిద్ధి సాపేక్ష మన్యత్రయమిహోచ్యతే** ॥ 5 ॥

తా. సద్యోరిష్ట, అరిష్ట, అమితాయుర్దాయము గురించి వరాహమిహిరాచ్యారుడు (తనగ్రంథమందు) చెప్పియుండెను. అమితమైన ఆయుర్దాయము యోగసిద్ధిని బట్టి యుండును.(గ్రహములను బలముకాదు) కనుక మిగిలిన అల్ప-మధ్య-దీర్ఘాయువులు మూడింటిగురించి యీ గ్రంథమందు చెప్పబడెను.

**విలగ్న జన్మరాశీశౌ పతి తద్రన్ధ్రయోరపి**
**శత్రూ సమౌ వయస్యౌ చేదల్ప మధ్య చిరాయుషః** ॥ 6 ॥

తా. లగ్న, చంద్రరాశ్యాధిపతులు లగ్న, చంద్రులయొక్క అష్టమాధిపతులకు శత్రువులైనచో అల్పాయువు, సములైనచో మధ్యమాయువు, మిత్రులైనచో దీర్ఘాయువు. *(విలగ్నమనినపుడు కొందరు చంద్రలగ్నమునకు అన్వయింతురు. కాని ఈ గ్రంథ మందది జన్మలగ్నమునకు వర్తించును. జన్మరాశి అనునప్పుడు చంద్రరాశియగును)*

**లగ్నేశో రశ్మిమాలీచ లగ్న రంధ్రశసావపి**
**శత్రూ సమౌ వయస్యౌ చేదల్ప మధ్య చిరాయుషః** ॥ 7 ॥

తా. లగ్నాధిపతియు, రవియు, లగ్నాష్టమముల యొక్క నవాంశాధిపతులును శత్రువులైనచో అల్పాయువు, సములైనచో మధ్యమాయువు, మిత్రులైనచో దీర్ఘాయువు *(లగ్నాధిపతికి రవితోను, లగ్ననవాంశాధిపతికి అష్టమాధిప, నవాంశాధిపతితోను శత్రుత్వములను ఊహించవలెను.)*

**బలవత్వం విలగ్నేంద్వోః సంబంధోద్వివిధశ్శుభైః**
**లగ్న జన్మేశయోర్వీర్యం తయోరేకాదశస్థతాః** ॥ 8 ॥

తా. లగ్నమునకు, చంద్రునకు దృష్టి, సంయోగములు అనె రెండు సంబంధ ములు శుభగ్రహములతో నుండుట బలకరము. ఇట్లే లగ్నాధిపతియు, చంద్రుడును ఏకాదశ స్థానములందుండుటయు బలకరమే అగును.

**త్రయోః కేంద్రే సంస్థితిశ్చ త్రిషాడాయేష్వసద్గ్రహాః**
**ద్వితీయ రంధ్రకేంద్రేషు కోణేషుచ శుభస్థితిః** ॥ 9 ॥

తా. పైన చెప్పబడిన లగ్న,చంద్ర,చంద్రరాశ్యాధిపతులు కేంద్రస్థితి పొందుటయు

3,6,11(త్రి,షట్,అయ)స్థానములందు దసగ్రహములు(పాపగ్రహములు) ఉండుటయు ద్వితీయాష్టమములందు, కేంద్రములందును, మరియు కోణములందును శుభగ్రహము లుండుటయును(ఈ వాక్యము తరువాత శ్లోకమందు పూర్తియగను.)

**అమౌఢ్యంచ గిరాం భర్తురాయుర్దైర్ఘ్యక రాగుణాః**
**దుర్బలత్వం విలగ్నేన్ద్వోః పాపదృష్టి సమాగమౌ ॥10॥**

తా. గువులు మూఢము పొందకుండుటయు-ఇవన్నియు(పూర్వ శ్లోకములోనివి) -దీర్ఘాయువు నిచ్చు గుణములగును. లగ్న, చంద్రులకు పాపగ్రహదృష్టి-సంయోగము లున్నచో ఆయుర్దాయము దుర్బలమగును.

**లగ్నే జన్మేశయో ర్మౌఢ్యం స్థితిర్నీచ వ్యయారిషు**
**కేంద్రత్రికోణ రంధ్రేషు పాప ఖేచర సంస్థితిః ॥11॥**

తా. లగ్న, చంద్రరాశ్యాధిపతులు మౌఢ్యమందుండుంట, నీచ-వ్యయ-శత్రు స్థానములందుండుట, కేంద్ర-త్రికోణ-అష్టమ స్థానములందు పాపగ్రహములుండుట( *ఈ వాక్యము 13వ శ్లోకముతో పూర్తియగును).*

**గ్రహేక్షిత స్యామృతాంశోః శత్రావాయుషివా స్థితిః**
**శుభానాంవా త్రిభిః పాపైః దృష్టానామష్టమే స్థితిః ॥12॥**

తా. ఇతర గ్రహములచే చూడబడుచు చంద్రుడు లగ్నమునుండి శత్రుస్థానమందు గాని, అష్టమమందుగాని యుండుట, ముగ్గురు పాపుల దృష్టి పడుచుండగా శుభ గ్రహము అష్టమస్థానములందు స్థితి పొందుట,

**రాశి సంధిషు చోత్పత్తి రాయుర్హానికరా నృణామ్**
**సంకీర్ణ త్వేతు యోగానాం మధ్యమాయుర్వినిర్దిశేత్ ॥13॥**

తా. రాశి సంధులందు జన్మించుట-ఇవన్నియు(పూర్వశ్లోకములతో కలిపి) నరులకు ఆయుర్దాయానికి హానికరములు.అయితే ఈ యోగముల సంకీర్ణత్వము (*అనగా శుభాశుభయోగముల కలగలుపు)* కల్గినపుడు మధ్యమాయువును నిర్ణయించ వచ్చును.

**దీర్ఘం మధ్య మథాల్పంవా యోగం నిశ్చిత్య బుద్ధిమాన్**
**తత్రాయురన్తరే బ్రూయా ద్దశాయాం హన్తురాపదమ్ ॥14॥**

తా. దీర్ఘ, మధ్యమ, అల్పాయుర్యోగములను తగు విచక్షణచే నిశ్చయించి,మారక గ్రహము యొక్క దశలో మారకము నిచ్చు అంతర్దశయందు మరణమును చెప్పవలెను.

**చంద్రాదష్టమ రాశీశః క్రూర ద్రేక్కాణపః శనిః**
**రంధ్రగౌ లగ్నచంద్రాభ్యాం రంధ్రస్వాపి విలోకకౌ ॥15॥**

తా. చంద్రునినుండి అష్టమరాశ్యాధిపతియు, క్రూర ద్రేక్కాణాధిపతియగు శని అష్టమస్థానమందు(అనగా లగ్నమునుండి )ఉన్నను, లేదా వారు లగ్న, చంద్రులలో ఎవరియొక్క అష్టమస్థానమును చూసినను(వాక్యము పూర్తి తరువాత శ్లోకములో)

**గుళికేశశ్చ రాహుశ్చ మారకాః పరికీర్తితాః**
**తేషుయో దుర్బలే దుష్టే భావేస్యాత్తం వినిర్దిశేత్ ॥16॥**

తా. గుళికేశుడు, రాహువుకూడ మారకులుగానే కీర్తించబడుచున్నారు. కనుక వీరందరిలో (అనగా పైశ్లోకములో చెప్పబడినవారితో గలిపి) ఎవడు దుర్బలుడై, దుష్టభావమందుండునో, వాడు మారకుడగునని నిర్ణయించవలెను.

**దశావాఽన్తర్దశా పి తస్య మృత్యుప్రదా భవేత్**
**మారకేశ్చ చ్ఛుభాధీశః తస్మాదన్యం వినిర్దిశేత్ ॥17॥**

తా. ఆ మారకునియొక్క దశగాని, అంతర్దశగాని మృత్యుప్రదమగును. ఆ మారకుడొకప్పుడు శుభాధిపతియైనచో ఆ గ్రహమును విడిచి మరొకరిని మారకునిగా నిర్ణయించవలెను.

**దేహే జీవేచ పాపస్య యోగస్స్యా న్మరణప్రదః**
**శుభ సంబంధ హీనత్వే దేహ జీవవశాగమే ॥18॥**

తా. తమ స్థానమందు గురువుండి, పాపుల సంయోగము గలిగి, శుభసంబంధం లేనివాడైనచో, వాని దశ వచ్చినపుడతడు మారకుడగను.

**జన్మరాశ్యంతికే [illegible] రల్ప మధ్య చిరాయుషమ్**
**క్రమాద్వినిర్దిశేత్ నృణాం మరణం గ్రహచారతః ॥19॥**

తా. జన్మరాశియందును, దానికిరు ప్రక్కలనుండు–అనగా 2,12రాసులందును గోచారము ప్రకారము సంచరించు శనివలన అల్ప–మధ్య–దీర్ఘాయువులు గల నరులకు క్రమముగా మరణము నిర్దేశించవలెను.(అనగా శని ఈ 3రాశులలో మొదటిరాశి

యందు సంచరించునపుడు అల్పాయుష్కులకు మరణమని, రెండవసారి సంచరించు నపుడు మధ్య మాయుష్కునకు మరణము క్రమముగా చెప్పవలెను. జన్మరాశి అనగా చంద్రలగ్నము కనుక, ప్రథమ-ద్వితీయ-తృతీయ ఏల్నాటి శనుల కిది అన్వయించును. *(కాని, శని నైధనతారయందు సంచరించునపుడు ముఖ్యముగా మారకముండును కనుక కొన్ని రాశులకు ఏలినాటి శని ప్రారంభించుటకు కొంచెం పూర్వము కూడా మారకము సంభవించుచుండును).*

**మంద రంధ్రేశయో రంశాద్రాశేర్వార్కే త్రికోణగే**
**ఆర్కారూఢ గృహస్యార్థ రిఃఫయోర్వా త్రికోణగే ॥20॥**

తా. శని, అష్టమాధిపతులు నవాంశ చక్రమందు ఏ రాశిలో ఉందురో, ఆ రాశికి గోచారవశమున సూర్యుడు త్రికోణములందు(1,5,9) సంచరించునపుడు, జన్మకాలమందు సూర్యుడున్నరాశికి 2,12, 5,9 రాశులందు గోచారపు సూర్యుడు సంచరించునపుడు మారకము చెప్పవలెను.

**అంశలగ్నాధిపాక్రాంత రాశేర్జీవే త్రికోణగే**
**కాలహోరాధిపాక్రాంత రాశేర్వా మరణం నృణామ్ ॥21॥**

తా. నవాంశ లగ్నాధిపతియున్న రాశినుండి కాని, కాలహోరాధిపతి ఉన్నరాశి నుండి కాని గురువు త్రికోణగతుడై(5,9)సంచరించు సమయమందును నరులకు మరణము సంభవించును. *(హోర అనగా సుమారు గంటకాలము. రాహు కేతువులను విడిచి సప్తగ్రహములు ఒకొక్క వరుస అనుసరించి ఆవృత్తులుగా తిరుగుచుండును. ఆ వరుస ఎట్లనగా రవి,శుక్ర,బుధ,చంద్ర,శని,గురు,కుజులు. ఆదివారం రవిహోరతో ప్రారంభించి, మూడు ఆవృత్తులు తిరిగి నాల్గవ ఆ వృత్తిలో రవి,శుక్ర,బుధ హోరలతో ఆదివారము ముగియును. సోమవారం చంద్రహోరతో ప్రారంభమగును. ఇట్లు వారములు ఏర్పడును. ఇంక కాలహోర అనగా జన్మదినమందే ఏ హోరలో జాత కుడు జన్మించునో దానిని ఏ గ్రహము అధిష్ఠించునో, అతడు కాలహోరాధిపతి.)*

**యోరాశిః సూర్యజాక్రాంతస్తద్ధనస్య వ్యయస్యవా**
**కోణే చరతి వాగీశే మరణం ప్రవదే నృణామ్ ॥22॥**

తా. (గోచారరీత్యా), శని ఏ రాశియందుండునో, ఆ రాశినుండి 2వ లేదా 12 స్థానానికి గాని కోణమగుచున్న రాశియందు గురువు సంచరించుచుండగా నరులకు

*మరణము చెప్పవలెను. (1,5,9స్థానములు కోణములు శనినుండి ద్వితీయారాశికి కోణములగు రాశులు 2,6,10 స్థానములగును. అదేవిధముగా రెండవరకము 12,4, 8 అగును.)*

**రాశేర్మందాదిరూఢస్య తృతీయా యాత్మజారిషు**
**దృష్టిమాస్మృతిదో జీవో యత్ర క్వచన సంచరన్ ॥23॥**

తా. శనియున్న రాశినుండి 3,11,5,6(తృతీయ,ఆయ,ఆత్మజ,అరి) స్థానములలో దేనియందైనా గోచారరీత్యా సంచరించుచున్న గురువు శనియొక్క దృష్టికలవాడైనచో మారకుడగును.

**అష్టమేశాశ్రితం రాశి మావసత్యహిమత్విషి**
**జన్మతారం విలగ్నస్య తారకాంవా మృతిం దిశేత్ ॥24॥**

తా. సూర్యుడు (అహిమత్విషి) అష్టమాధిపతి ఉన్న రాశిని గోచారరీత్యా పొంది నపుడు జన్మనక్షత్రముగాని, లగ్ననక్షత్రముగాని మృతిని కలిగించును. (*జన్మ నక్షత్ర మనగా ఏ నక్షత్రమునందు జన్మించునో అది, లగ్ననక్షత్రమనగా లగ్నరాశియందు లగ్నస్ఫుటమగు నక్షత్రము)*

**స్వాంశాద్రంధ్రేశ్వరాంశాచ్చ లగ్నేశాంశాశ్చ రాశిషు**
**స్థితో జన్మని తిగ్మాంశుః చరన్కోణే మృతిప్రదః ॥25॥**



తా. సూర్యుడు (తిగ్మాంశుః) జననకాలమందు స్థితమైన రాశియందతనియొక్క నవాంశనుండి, లేదా అష్టమాధిపతి నవాంశమునుండి, లేదా లగ్నాధిపతి నవాంశ నుండి గోచారరీత్యా సంచరించునపుడు కోణమును పొందినచో ఆ రవి మారకుడగును.

**సూర్యాశ్రితర్క్షగే చంద్రే రంధ్రేశాధిష్ఠితోడుగే**
**జన్మరాశే స్త్రికోణేవా నిర్దిష్టం మరణం నృణామ్ ॥26॥**

తా. జన్మకాలమందు సూర్యుడాశ్రయించిన రాశిని గోచార చంద్రుడు సంచరించు నపుడు, లేదా అష్టమాధిపతియున్న రాశిని(నక్షత్రమును)పొందినను, లేదా జన్మరాశి యొక్క త్రికోణమందున్నను నరులకు మరణము తథ్యము. (*పూర్వశ్లోకములో గోచార సూర్యునిబట్టి ఏ మాసమందు మారకము కలుగునో చెప్పబడెను. ఇక్కడ గోచార చంద్రుని బట్టి మారకము నిర్ణయము చేయుట చెప్పబడెను.* )

**ధనేశాశ్రితరాశేర్వా తత్సప్తమా గృహస్యవా**
**త్రికోణస్థే ధనేశాంశ చరేవా శీతగౌ మృతిః ॥27॥**

తా. చంద్రుడు ధనాధిపతియున్న రాశికిగాని దానికి ఏడవ రాశికి గాని త్రి కోణమందున్నను లేదా ధనాధిపతియొక్క నవాంశరాశి యందు(గోచారరీత్యా) సంచ రించుచున్నను మరణము కలుగును.

**నిజజన్మని యస్మిన్భే గుళికస్తద్గతే విధౌ**
**రోగారంభస్తదస్తరేక్ష మరణం ధృఢ మాదిశేత్ ॥28॥**

తా. జన్మకుండలిలో ఏ రాశియందు గుళికుదుండునో, దానియందు చంద్రుడు (గోచారరీత్యా)సంచరించునపుడు రోగారంభము కలుగును. ఆ రాశికి సప్తమమందు చంద్రుడు సంచరించునపుడా రోగి మరణించుననియు దృఢముగా చెప్పవలెను.

**మందే జీవార్క చంద్రాణాం ప్రోక్తేష్వితేషు రాశిషు**
**మృతిమష్టక వర్గేణ హీనరాశౌ సమాధిశేత్ ॥29॥**

తా. శని,గురు,రవి,చంద్రులకు చెప్పబడు రాశులలో(వారి స్వక్షేత్రములలో) అష్టకవర్గు ప్రకారము తక్కువ బిందువులు కలిగిన రాశియందు(గోచారరీత్యా ఆ గ్రహములు సంచరిస్తున్నపుడు)మరణము కలుగునని చెప్పవలెను.

**విలగ్నదాష్టమే లగ్నే రంధ్రేశాశ్రిత భేఽపివా**
**లగ్నేశ రాశ్యంశకయోర్మృతి లగ్నేఽథవా మృతిః ॥30॥**

తా. జన్మలగ్నమునుండి అష్టమ లగ్నమందుగాని, అష్టమాధిపతియుండు క్షేత్ర మునందుగాని, లేదా లగ్నాధిపతి యొక్క నవాంశలు రెండింటిలో ఏది మృతలగ్నమో (అష్టమలగ్నము) దానియందు మృతి కలుగును. *(మారకదిన నిర్ణయానంతరం ఆనాడే లగ్నమందు మృత్యువు కలుగునని ఇక్కడ చెప్పబడెను.)*

*ప్రథమ మయూఖమైన*

*ఆయుర్భావాము సమాప్తము.*

--((o))--

(ద్వితీయ మయూఖము)

## కళత్రభావము

**అస్త తన్నాథ తద్ద్రష్టృ తద్యుక్త భృగుజాదయః**
**సాధనాని కళత్రస్య బలాబల నిరూపణే ॥ 1 ॥**

తా. సప్తమస్థానము, దానికి అధిపతి, వానిని జూచుచున్న లేదా వానితో కలసి ఉన్న శుక్రాదిగ్రహములు–ఇవి కళత్రభావము యొక్క బలాబల నిర్ణయ సాధనములు.

**శుక్రాస్తనాథ తత్స్థానాం సర్వేషామిహ యోబలీ**
**భార్యాయాః సంభవన్తీహ తస్య వర్ణాదయో గుణాః ॥ 2 ॥**

తా. శుక్రుడు(అనగా కళత్రకారకుడు) సప్తమాధిపతి, సప్తమమందున్న గ్రహ ములు–వీరందరిలో ఎవరు బలవంతుడో, వానియొక్క రంగు మొ. గుణములు కళత్ర మందుండును.

**నవమే శుక్రసంయుక్తే కళత్రేశే బలాన్వితే**
**ధర్మశీలా భవేద్భార్యా సపుత్రా భాగ్యావత్యపి ॥ 3 ॥**

తా. నవమస్థానము శుక్రునితో కూడి యుండగా కళత్రస్థానాధిపతి బలవంతుడై యున్నయెడల కళత్రము పుత్రవతి, భాగ్యవతి, ధర్మశీల అగును.

**పంచమే సప్తమే లాభే నవమేవా శుభగ్రహాః**
**కళత్ర భావతః ప్రోక్తాస్తద్భావ బలహేతవః ॥ 4 ॥**

తా. కళత్రభావమునుండి 7,9,11 స్థానములందుండు గ్రహములు ఆ కళత్ర భావమునకు బలమిచ్చునని చెప్పబడును.

**దారేశే శుభసంయుక్తే శుభఖేచర వీక్షితే**
**శుక్రేవా దారాభావస్థే భవేద్భార్యా పతివ్రతా ॥ 5 ॥**

తా. సప్తమాధిపతి శుభునితో కూడియున్నను, శుభగ్రహ వీక్షణ గలిగియున్నను,

సప్తమస్థానమునందు శుక్రుడున్నను జాతకుని భార్య పతివ్రత అగును.

**భార్యా వియోగో మర్త్యానాం సప్తమస్థే ధరాసుతే**
**చంద్రమాత్రే క్షిత యుతే నిశ్చయేన వధూమృతిః ॥ 6 ॥**

తా. సప్తమమందు కుజుడున్నచో నరులకు భార్యావియోగమగును. ఆ కుజుడు చంద్రదృష్టిచే మాత్రము కూడియున్నచో(అనగా ఇతర గ్రహదృష్టి లేక చంద్రదృష్టి మాత్రమే పొందియున్నచో)జాతకుని భార్య నిశ్చయముగా మరణించును.

**నక్రస్థః సప్తమే జీవః కీటస్థః సప్తమే సితః**
**వృషస్థః సప్తమే చాంద్రిః శుభా అప్య శుభాఃఫలే ॥ 7 ॥**

తా. మకరము సప్తమమై దానియుందు గురువున్నను, వృశ్చికము సప్తమమై దానియందు శుక్రుడున్నను, వృషభము సప్తమమై దానియందు బుధుడున్నను, ఈ ముగ్గురు శుభులే అయినను ఫలమిచ్చుటలో అశుభులు అగుదురు. అనగా కళత్ర భావమునకు దోషమును కలిగించుదురు.

**రంధ్రేశః పంచమేశోవా భవేద్యది కళత్రగః**
**హన్యత్కళత్రం జాతానా మితి కేరళనిర్ణయః ॥ 8 ॥**

తా. అష్టమాధిపతికాని, పంచమాధిపతికాని కళత్రస్థానమునందున్నచో నరులకు (జాతానాం) కళత్రహాని అగునని కేరళశాస్త్ర నిర్ణయము.

**చరరాశిగతః శుక్రం పాప మధ్యగతో యది**
**యుక్తో మందేన దృష్టోవా నాశం యాస్యతి భామినీ ॥ 9 ॥**

తా. చరరాశిగతుడైన శుక్రుడు పాపగ్రహముల మధ్యనుండి, శనితో కూడి యున్నను లేదా చూడబడినను కళత్రనష్టమగును.

**కళత్రేవా కుటుంబేవా పాప దృగ్యోగ సంభవే**
**తదీశే బలహీనేతు కళత్రాంతర మాదిశేత్ ॥10 ॥**

తా. కళత్ర లేక కుటుంబస్థానమునకు పాపగ్రహ దృష్టి సంయోగములు కలిగి బలహీనుడు ఆస్థానాధిపతియైనచో కళత్రాంతర(అనగా ద్వికళత్ర)యోగము చెప్పబడును.

**సప్తమేవాఽష్టమే పాపే వ్యయే భూసూనునా యుతే**
**అదృష్టే యది నాథేన కళత్రాంతర మాదిశేత్ ॥11 ॥**

తా. సప్తమస్థానమందుగాని అష్టమమందుగాని ఒక పాపగ్రహముండగా కుజుడు 12వ యింటిలో నుండి ఆ భావాధిపతిచే చూడబడనప్పుడు కళత్రాంతరము సంభవము.

**దారేశస్థ నవాంశే శే నీచమూఢారి భాంశగే**
**పాపమధ్యే పాపదృష్టే కళత్రాంతర మాదిశేత్ ॥12॥**

తా. కళత్రాధిపతి ఉన్న నవాంశాధిపతి నీచస్థితిని, మౌఢ్యమును, లేదా శత్రు క్షేత్రాంశను పొంది పాపగ్రహ మధ్యస్థుడగుట వలనగాని పాపగ్రహ వీక్షితుడగుట వలనగాని కళత్రాంతరము చెప్పబడును.

**విత్తే పాప బహుత్వేతు కళత్రేవా తథా విధే**
**తదీశే పాపదృష్టేతు కళత్రత్రయ మాదిశేత్ ॥13॥**

తా. ధనస్థానమందుగాని కళత్రస్థానమందుగాని పాపగ్రహములు బహుళముగా వుండి,ఆ స్థానాధిపతికికూడా పాపగ్రహదృష్టి కలిగిన యెడల కళత్రత్రయము చెప్పబడను.

**కళత్ర లాభనాథౌ ద్వౌ పరస్పర నిరీక్షితౌ**
**బలాఢ్యౌవా త్రికోణస్థౌ బహుదారయుతో భవేత్ ॥14॥**

తా. కళత్ర, లాభాస్థానాధిపతులు ఇద్దరును పరస్పర వీక్షణ కలవారైనను, బల వంతులై త్రికోణస్థితులైనను బహుకళత్రయోగము సంభవించును.

**అస్తతన్నాథ శుక్రాద్యై ర్యథా దార నిరూపణమ్**
**పుంసాం తథైవ నారీణాం కర్తవ్యం భర్తృ చింతనమ్ ॥15॥**

తా. సప్తమరాశిచేతను, ఆ రాశ్యాధిపతిచేతను, శుక్రాదులచేతను, పురుషులకెట్లు కళత్రవిషయము నిరూపించబడునో, అట్లే స్త్రీలకు భర్తనుగురించి భావించవలెను.

**నాథస్య హానిర్నారీణాం రాహౌ భౌమే౽థవా౽ష్టమే**
**పాపై రాలోకిత స్తద్వ దష్టమస్థః శనైశ్చరః ॥16॥**

తా. స్త్రీ జాతకమందు రాహువుకాని కుజుడుగాని అష్టమమందున్నను, లేదా పాపులచే చూడబడుచు శని అష్టమమందున్నను భర్తృవియోగము కలుగును.

**శుక్రోవా సప్తమేశోవా బలవాన్కేంద్రగో౽పివా**
**లగ్ననాథేన యుక్తోవా బాల్యే పరిణయో భవేత్ ॥17॥**

తా. శుక్రుడుకాని, సప్తమాధిపతికాని బలవంతుడై కేంద్రమందున్నను లేదా

లగ్నాధిపతితో కూడియున్నను బాల్యమందు వివాహమగును.

**తౌ చేదుపచయస్థానే వివాహే ధనలాభదౌ**
**లగ్నేశాదస్తపో దూరే దూరే పాణిగ్రహో భవేత్ ॥18॥**

తా. వారు(పూర్వోక్త శ్లోకములో చెప్పబడిన శుక్ర సప్తమాధిపతులు) ఉపచయ (3,6,10,11) స్థానములందున్నచో వివాహకాలమందు ధనలాభమిచ్చెదరు. సప్తమాధి పతి లగ్నాధిపతికి దూరముగా నున్న ఎడల పాణిగ్రహమును దూరము(ఆలస్యము) గావించును.

**జామిత్రే తత్పతి స్థానే తయోః సప్తమేభేఽపివా**
**తయోః కోణే థవా జీవాద్ద్యూనే కోణేఽథవాపునః ॥19॥**

తా. సప్తమస్థానమందు, లేదా సప్తమాధిపతియున్న స్థానమందు, లేదా ఆ రెండింటికి సప్తమరాశియందుగాని కోణమందుగాని లేదా గురువునకు 7,5,9 రాశు లందు(తరువాత శ్లోకములో వాక్య పూర్తి)

**శుక్రలగ్నాస్త జన్మేశాం సవీర్యేచరతి గ్రహే**
**నారీణా మథవా పుంసాం వివాహస్తు భవిష్యతి ॥20॥**

తా. శుక్రలగ్నం, జన్మలగ్నం, దానికి సప్తమ, చంద్రులున్న రాశియందు గోచార రీత్యా బలవంతుడైన గ్రహము సంచరించిన సమయమందు స్త్రీకిగాని, పురుషునకుగాని వివాహమగునని చెప్పవలెను.

(ద్వితీయమయూఖమైన కళత్రభావము)

సమాప్తము.

-)))(0)(((-

## (తృతీయ మయూఖము)
# పుత్రభావము

**పుత్రస్థానగతే శీతరశ్మౌ పూర్ణ బలాన్వితే**
**దృష్టేవా దేవగురుణా పుత్రావాప్తి ర్నసంశయః** ॥ 1 ॥

తా. పూర్ణబలవంతుడై చంద్రుడు పుత్రస్థానమునందున్నను దేవగురువైన గురునిచే చూడబడినను పుత్రప్రాప్తి నిస్సంశయముగానుండును.

**లగ్న పుత్రాధిపౌ కేంద్రే శుభగ్రహౌ సమన్వితౌ**
**కుటుంబేశే బలాఢ్యేచ పుత్రావాప్తిం వినిర్దిశేత్** ॥ 2 ॥

తా. లగ్న, పంచమాధిపతులు శుభగ్రహములతో కూడి కేంద్రములందుండి, కుటుంబాధిపతి బలవంతుడై ఉన్నచో పుత్రప్రాప్తి చెప్పబడును.

**పుత్రేశ్వారాంశరాశీశే శుభేవా శుభసంయుతే**
**శుభేన వీక్షితేవాపి పుత్రావాప్తిం వినిర్దిశేత్** ॥ 3 ॥

తా. పుత్రస్థానాధిపతి యొక్క నవాంశరాశ్యాధిపతి శుభుడైనను, లేదా శుభులతో కూడివున్నను, లేదా శుభవీక్షణ కలిగినను పుత్రప్రాప్తి కలుగును.

**స్వక్షేత్ర సింహ మీనస్థః పుత్రస్థానగతః కుజః**
**దృష్టశ్చే ద్దేవ గురుణా పుత్రావాప్తిం వినిర్దిశేత్** ॥ 4 ॥

తా. మేష, వృశ్చిక, సింహ, మీనములలో నేదైన ఒకరాశిపంచమమై, అందు కుజుడుండి గురునిచే చూడబడెనేని పుత్రప్రాప్తి చెప్పవలెను.

**యుక్తౌ లగ్నాసుతాధీశౌ వీక్షితే వా పరస్పరమ్**
**పరివర్తన మాప్తౌవా పుత్రయోగాస్త్రయః శుభాః** ॥ 5 ॥

తా. లగ్న, పంచమాధిపతుల సంయోగము, లేదా వారి పరస్పర వీక్షణ లేదా వారి పరివర్తనము-అను ఈ మూడు అంశములు పుత్రప్రాప్తికి శుభయోగములు

**పుత్రేశాంశపతౌలగ్నే లగ్నేశాంపతౌ సుతే**
**జీవ స్వాంశపతౌకేంద్రే పుత్రాప్తిం మనయోవిదుః ॥ 6 ॥**

తా. పుత్రస్థానాధిపతియొక్క నవాంశాధిపతి లగ్నమందుండి లగ్నాధిపతియొక్క నవాంశాధిపతి పుత్రస్థానమునందుండగా, గురుని యొక్క నవాంశాధిపతి కేంద్రము నందున్నచో పుత్రప్రాప్తికి హేతువుగా మునులు చెప్పుచున్నారు.

**గర్భాధాన సమర్ధత్వం సూర్యాద్రేతశ్చ భార్గవాత్**
**ఓజరాశ్యంశగౌ చేత్పుంసాం పుత్రాప్తిరిష్యతే ॥ 7 ॥**

తా. సూర్యుని వలన (పురుషులకు)గర్భాదాన సామర్ధ్యము, శుక్రుని వలన రేతస్సు కలుగుచున్నవి. ఆ రవి శుక్రులిరువురు ఓజోరాశ్యాంశలను పొందినచో పురుషులకు పుత్ర ప్రాప్తి అగును. (ఓజోరాశి–బేసిరాశి).

**గర్భధారణ సామర్ధ్యం చంద్రద్రక్త గుణఃకుజాత్**
**సమరాశ్యంశగౌ తౌ చేత్పుత్రలాభస్తు యోషితామ్ ॥ 8 ॥**

తా. గర్భధారణ సామర్ధ్యము(స్త్రీలకు) చంద్రునివల్లను, రక్తగుణము కుజుని వల్లను కలుగును. ఆ చంద్ర, కుజులిరువురు సమరాశ్యాంశలను పొందిన స్త్రీలకు పుత్రలాభమగును.

**సూర్యశుక్రౌ గురుయుతౌ పుంసో బీజస్ఫుటం భవేత్**
**చంద్రభౌమో గురుయుతౌ స్త్రీణాం క్షేత్రస్ఫుటం భవేత్ ॥ 9 ॥**

తా. గురు శుక్రులు గురునితో కలసినప్పుడు పురుషునకు బీజస్ఫుటమగును. చంద్ర, కుజ,గురునితో కలసినప్పుడు స్త్రీకి క్షేత్రస్ఫుటమగును. *(ఇక్కడ కలియవలసినవి గ్రహస్ఫుటములు మొదటి ముగ్గురి స్ఫుటములు కలిపినచో జీజముయొక్క బలస్ఫుటమగును. తరువాత ముగ్గురు స్ఫుటములు కూడినచో క్షేత్రము యొక్క బలస్ఫుటమగును)*

**ఓజోరాశ్యంశగం బీజం క్షేత్రంతు సమభాంశగమ్**
**ద్వయాత్పుత్రే శుభయుతిః సన్తత్యై నరయోషితామ్ ॥10 ॥**

తా. బీజము ఓజ(బేసి)రాశ్యంశలను పొందినప్పుడు, క్షేత్రము సమరాశ్యాంశలును పొందినప్పుడు, ఆ బీజక్షేత్రముల రెండింటికి పంచమస్థానములు శుభగ్రహయుతము లైనచో అట్టి స్త్రీపురుషులు సంతతి కలవారగును.

**క్లీబైః పాపైశ్చ సంబద్ధం బీజం వా క్షేత్రమేవవా**
**సంతతి ప్రతిబంధాయ నరాణామపి యోషితామ్ ॥11॥**

తా. పురుషజాతకములో బీజమనబడునది, స్త్రీ జాతకములో క్షేత్రమనబడునది నపుంసకులగు శని, బుధుల యొక్క, పాపగ్రహముల యొక్క సంబంధం కలిగిన యెడల ఆ స్త్రీపురుషులకు సంతాన ప్రతిబంధకమగును.

**జన్మపుత్రాస్త లగ్నేశాః జీవస్యచ బలాబలాత్**
**సామాన్యశాస్త్ర విజ్ఞేయా స్సన్తతేస్తు బలాబలమ్ ॥12॥**

తా. సంతానయోగము యొక్క బలాబలము అనుసరించి సామాన్యశాస్త్రము చొప్పున జన్మరాశి, సప్తమరాశి, లగ్నస్థానముల యొక్క అధిపతులు తెలియదగ్గవారు ఈ విషయము జీవుని(గురుని) బలాబలములవల్లను తెలియదగినది.

**ఓజరాశ్యంశగాః పుత్రనాథ జీవార్క భూమిజాః**
**అపత్యయోగినాం కుర్యు ర్వృద్ధిం పురుషసన్తతేః ॥13॥**

తా. సంతానయోగము గలవారికి పుత్రస్థానాధిపతి గురుడు, రవి, కుజుడు ఓజరాశ్యాంశలను పొందినచో పుత్రసంతానవృద్ధి కలుగును.

**సమరాశ్యాంశగాః పుత్రనాథ శుక్ర సుధాంశవః**
**అపత్యయోగినాం కుర్యుర్వృద్ధిం దుహితృ సంతతేః ॥14॥**

తా. సంతానయోగము కలవారికి సమరాశ్యంశములను పొందిన పుత్రస్థానాధిపతి శుక్రుడు, చంద్రుడు స్త్రీ సంతతిని వృద్ధిని చేయుదురు.

**పుత్రభావస్య షష్ఠ్యంశాన్ భుక్తాన్ హిత్వాగ్రహేక్షణైః**
**నఖైః హృతేతు యచ్ఛేషం తత్సంఖ్యా సమసంతతిః ॥15॥**

తా. పుత్రభావము యొక్క భుక్తమైన షష్ఠ్యంశలనుండి గ్రహదృష్టుల సంఖ్యను తీసివేయగా మిగిలిన సంఖ్యను 7చే భాగించినప్పుడు శేషమెంతయో అంత స్త్రీపురుష సంతానము సరిసమానముగా నుండునని చెప్పవలెను.

**తుల్యాం పుత్రేశ భుక్తాంశైః సంఖ్యాయా సంతతిం పరే**
**పుమీశైః పురుషాస్తేషు స్త్రీశైః కన్యాశ్చ సమ్మతాః ॥16॥**

తా. పుత్రస్థానాధిపతియొక్క భుక్తమైన అంశల సంఖ్యకు తుల్యముగా సంతాన

సంఖ్యను చెప్పవలెనని కొందరి మతము. వీరి మతము చొప్పున ఆ భుక్తాంశలయొక్క అధిపతులలో పురుష గ్రహములు ఎందరో అందరు పురుషసంతానమని, స్త్రీ గ్రహము లెందరో అందరు స్త్రీ సంతానము చెప్పబడును.

**పుం సంతతి నిమిత్తానామోజ భాంశస్థితిర్వరా**
**స్త్రీసంతతి నిమిత్తానాం యుగ్మభాంశ స్థితిస్తథా ॥17॥**

తా. పురుష సంతతికి కారణమైన గ్రహములకు ఓజరాశి నవాంశస్థితి ముఖ్యమైనది. స్త్రీ సంతతికి కారణములైన గ్రహములకు యుగ్మరాశి యుగ్మనవాంశస్థితి ముఖ్యము. (*ఇక్కడ సంతాన కారక గ్రహములు యుగ్మరాశీనవాంశను పొందినచో సంతానము నిత్తురనియు, ఆ గ్రహములు సమరాశి నవాంశను పొంది స్త్రీసంతానమును వృద్ధిబరుతురనియు వ్యత్యాసము తెలియవలెను.*)

**విపరీతస్థితా స్తేతు తత్తత్సన్తతి మృత్యుదాః**
**అంశాధిపానాం వీర్యంచ చిన్త్యమత్ర మనీషిభిః ॥18॥**

తా. పై శ్లోకములో చెప్పబడినదానికి విరుద్ధముగా పురుషసంతతి కారకగ్రహములు యుగ్మరాశి నవాంశయందును, స్త్రీ సంతతికి కారకగ్రహములు ఓజరాశి నవాంశయందును ఉండుట విపరీతము. అట్టి విపరీతస్థితిచే మొదటివారు పురుష సంతతికి, రెండవవారు స్త్రీ సంతతికి మృత్యుకారకులగుదురు. కనుక బుద్ధిమంతులీ విపరీతస్థితిని విచారించునప్పుడు అంశాధిపతుల బలములను విమర్శనము చేయవలెను.

**వక్రీ తుంగస్థితో వాఽసావేక ఏవ భవేత్త్రిదః**
**స్వర్క్ష మిత్రర్క్ష సంస్థశ్చేదేక ఏవ భవేద్ద్విదః ॥19॥**

తా. (ఆ కారకగ్రహములలో) ఒకటి వక్రించి, యుచ్ఛస్థితిని గూడా పొందినచో ముగ్గురు సంతానమని, స్వక్షేత్ర మిత్ర క్షేత్రములు రెండు సిద్ధించిన గ్రహమున్నచో ఇద్దరు సంతానమని ఎరుగవలెను.

**మూఢో నీచస్థితో వారి శత్రుక్షేత్ర గతోఽపివా**
**న దద్యాదపి దత్వావా క్షేమం కర్తుం నపారయేత్ ॥20॥**

తా. మూఢమునందున్న గ్రహమునకు కాని, నీచయందున్నది కాని, శత్రుక్షేత్ర గతమైనది కాని సంతతీనీయదు. ఒకప్పుడిచ్చినను ఆ సంతానమునకు క్షేమంకలుగదు.

*(అనగా చంపునని అర్థము.)*

**గురోరష్టక వర్గేతు పుత్రర్క్షే శుద్ధబిందుభిః**
**గ్రహాణాం బలయుక్తానాం తుల్యసంఖ్యా యుతాత్మజా ॥21॥**

తా. గురువు యొక్క అష్టకవర్గ చక్రములో పుత్రస్థానమందున్న శుద్ధబిందువులచే బలము చెందిన గ్రహముల సంఖ్యకు తుల్యముగా సంతానసంఖ్య ఉండును.

**తేషాంతు స్త్రీత్వ పుంస్త్వాభ్యాం స్త్రియః పుంసోఽత్ర నిర్దిశేత్**
**బలీపుత్రేశ గుర్వోర్యస్తస్య రశ్మేః సంతానయేత్ ॥22॥**

తా. పై విధముగా బలము చెందిన గ్రహములలో స్త్రీ, పురుష విభాగముచే స్త్రీ, పురుష సంతానమును నిర్దేశించవలెను. పుత్రస్థానాధిపతి, గురువు ఇద్దరిలో ఎవడు బలవంతుడో వాని రశ్ముల సంఖ్యకు తుల్యమగు సంతానము పొందబడును.

**దశ భానోర్న వేందోః స్యుః పంచభామార్క భూవిదామ్**
**గురోః సప్త సిత స్యాష్టౌ శాస్త్రేత్ర ధ్రువరశ్మయః ॥23॥**

తా. ఈ శాస్త్రమందు గ్రహములకు నిశ్చయించబడిన రశ్ములెట్లనగా రవి-10; చంద్రునకు-9; కుజునకు-5; శనికి-5; బుధునకు-5; గురువునకు-7; శుక్రునకు-8. (రాహుకేతువులు ఛాయాగ్రహములు గనుక విడువబడెను.)

**గ్రహాంస్వనీచే సంశోధ్య షడూనం చేద్యథాస్థితిమ్**
**చక్రాన్నిర్గళితం కృత్వాయది షడ్భాధికరం భవేత్ ॥24॥**
**ధ్రువంరశ్మిహతం కృత్వాషడ్భిఛ్ఛం విభజేత్పునః**
**లబ్ధాస్తురశ్మయోజ్ఞేయాః సంతతి స్తత్సమా భవేత్ ॥25॥**
**రశ్మయ స్త్రిగుణాజ్ఞేయాస్తుంగస్థే వక్రిణిగ్రహే**
**మిత్రస్వాంశగతే ఖేటే ద్విగుణాః పరికీర్తితాః ॥26॥**

తా. ఏదైనా ఒక గ్రహము తన నీచరాశియందుండి 6రాశులలోపున ఉన్నయెడల అట్లు ఉంచవలెను. 6రాశులను దాటినచో 12రాశులనుండి తీసివేయవలెను. ఇట్టి శేషమును ఆ గ్రహముయొక్క రశ్ములచే గుణించి 6చే భాగించగా శేషమెంతవచ్చునో అంత సంఖ్యకు సరిసమానమైన సంతతి కలుగునని చెప్పవలెను. మరియు విశేషం ఏమనగా గ్రహము ఉచ్ఛాంశయందుగాని, వక్రించిగాని ఉన్నపుడు ఆ గ్రహరశ్ములను

త్రిగుణము చేయవలెను. మిత్ర స్వక్షేత్రాంశములను పొందినచో ద్విగుణము చేయ వలెను. ఇచ్చట "అంశ" శబ్దమును ద్వాదశాంశమును గ్రహించవలెను.

**నీచారిక్షేత్రమౌఢ్యేషు న్యూనాః కార్యా యథోచితమ్**
**ఏకాంశయుక్తే సూర్యేణ నకశ్చిచ్ఛిష్యతే కరః ॥27॥**

తా. గ్రహములు నీచ, శత్రుక్షేత్రాంశములను పొందినను, తమ రశ్మలందు 1/16వంతు క్షీణమగును. రవితో ఏకాంశగతులై అస్తమించినచో పూర్తిగా రశ్మలను నష్టపోవుదురు.

**ప్రోక్తా స్వాత్మజ సంఖ్యాసు గ్రాహ్యాయా భూయసీ భవేత్**
**బలవత్యాత్మజాధీశే దుర్బలేతు కనీయసీ ॥28॥**

తా. పుత్రస్థానాధిప. గురువులలో పుత్రస్థానాధిపతి బలవంతుడైనచో ఆ స్థాన మందున్న గ్రహరశ్మల సంఖ్యలో నధికమైన దానిని దుర్బలుడైనచో ఆ గ్రహరశ్మల సంఖ్యలో తక్కువైనదానిని తీసుకొనవలెను.

**పుత్రభావే పాపయుతే శుక్రే సప్తమ భావగే**
**చతుర్థే చంద్రసంయుక్తే పుత్రాభావం వినిర్దిశేత్ ॥29॥**

తా. పుత్రస్థానము పాపగ్రహయుతమై, శుక్రుడు కళత్రభావమును పొంది, చంద్రుడు నాల్గవయింట నున్నచో పుత్రాభావము (సంతానహీనత)నిర్దేశించవలెను.

**తనుభావే పుత్రభావే రన్ధ్రే వ్యయగృహే యథా**
**యది పాపగ్రహాః సర్వే పుత్రాభావం వినిర్దిశేత్ ॥30॥**

తా. 1,5, 8, 12 స్థానములలో పాపులందరు చేరినయెడల పుత్రాభావము చెప్పవలెను. (సంతానము ఉండదు)

**తనుభావే పాపయుతే తనుపే పుత్రభావగే**
**చతుర్థం చంద్ర సంయుక్తే పుత్రాభావం వినర్దిశేత్ ॥31॥**

తా. తను భావము పాపగ్రహయుతమై, తను భావాధిపతి పుత్రభావము పొంది చతుర్థస్థానము చంద్రయుతమైనచో పుత్రాభావము చెప్పవలెను.

**క్షీణేందుః పంచమే పాపాః సప్తమ వ్యయ లగ్నగాః**
**యస్యసోఽయమపుత్రః స్యాదభార్యశ్చ నసంశయః ॥32॥**

తా. క్షీణచంద్రుడు పంచమస్థానమందు, పాపులు లగ్న, సప్తమ, వ్యయస్థాన ములందున్న ఎడల జాతకుడు భార్యాపుత్రులు లేనివాడనుటకు సందేహము లేదు.

**మందభస్తే పాపయుతే మూఢే జీవే త్రికోణగే**
**లగ్నే క్షీణేందు సంయుక్తే పుత్రాభావం వినిర్దిశేత్ ॥33॥**

తా. గురువు శని క్షేత్రమందుండి, పాపులతో కూడి, మౌఢ్యము పొంది, త్రికోణ గతుడై ఉన్నపుడు, లగ్నము క్షీణచంద్రునితో గూడి ఉన్నచో పుత్రాభావము కలుగును.

**లగ్నే చతుర్థే పుత్రేవా బుధే పాపసమన్వితే**
**త్రికోణ సంస్థితైః పాపైః పుత్రాభావం వినిర్దిశేత్ ॥34॥**

తా. 1.4.5లందు బుధుడు పాపగ్రహయుతుడై వుండి, పాపులు త్రికోణము లందున్నపుడు పుత్రాభావము చెప్పవలెను.

**పుత్రేశః పుత్రభావస్య సమీపే లగ్నపస్యవా**
**యద్యాదౌ పుత్రజన్మస్యా ద్యౌవనేఽన్యేఽన్యథాఽయుషీ ॥35॥**

తా. పుత్రస్థానాధిపతి పుత్రభావమునకుగాని, లగ్నాధిపతికి సమీపమునందున్న ఎడల జాతకుని యౌవనారంభమునందు, దూరముగా ఉన్నఎడల వయస్సు మళ్ళిన పిదప పుత్రజన్మము కలుగును.

**జీవలగ్నేశ పుత్రేశాస్తద్ద్వ యుప్తాంశ భేశ్వరాః**
**పుత్రగః పుత్రభప్రేక్షీ తథా జాయాధి నాయకః ॥36॥**

తా. గురువు లగ్నాధిపతి, పంచమాధిపతులు ముగ్గురియందు ఏ ఇద్దరి నవాంశ లయొక్క అధిపతులైనను, పుత్రస్థానమందున్న గ్రహమైనను, లేదా పుత్రస్థానము చూచు నట్టి గ్రహమైనను, సప్తమాధిపతియైనను (వాక్యాంతము తరువాత శ్లోకములో)

**ఏతేషాంతు దశాకాలే భుక్తికాలేఽథవా పునః**
**నరాణాం సన్తతి ప్రాప్తిరితి కేరళ నిర్ణయః ॥37॥**

తా. వారిలో ఏ ఒక్కని దశాకాలమందుకాని, అంతర్దశా కాలమందుకాని మరల మరల సంతానప్రాప్తి యగుచుండునని కేరళశాస్త్ర నిర్ణయము.

**పుత్రభే తత్పతి స్థానే తయోః సప్తమ భేఽపివా**
**తయోః కోణేఽథవా జీవ విలగ్న తనయేశ్వరౌ ॥38॥**

తా. పుత్రరాశియందు, లేదా పుత్ర స్థానాధిపతియుండు రాశియందు, లేదా ఆ రెండింటికి సప్తమమగు రాశియందు, లేదా వాటికి కోణములందు లగ్న, పంచమాధిపతులు, గురువు.( తరువాత శ్లోకములో వాక్యాంతం)

**సంచ రేయుర్యదా కాలే తదా సన్తతి రిష్యతే**
**యదావా సంయుతాస్తే స్యుస్తదావా సన్తతిర్భవేత్ ॥39 ॥**

తా. (పూర్వశ్లోకములో చెప్పబడినవారు అయా స్థానము లందు గోచారరీత్యా) ఏ యే దశాకాలమందు సంచరింతురో, ఆయా కాలములందు సంతానము కలుగుచుందును. లేదా ఎప్పుడు వారు తమ సంచారమందు కలియుచుందురో, అప్పుడైనను సంతానము నిచ్చెదరు.

తృతీయమయూఖమైన పుత్రభావము
సమాప్తము.

**ఇట్లు శ్రీభగవాన్ రమణమహర్షి కంతేవాసియున్**
**వాసిష్ఠ గోత్ర నరసింహశాస్త్రికి పుత్రుడును**
**అగు గణపతిమునియొక్క కృతియైన**
**త్రిభావ ఫలచంద్రిక**
**సమాప్తము.**



**–(((0)))–**

# షోడశ శ్లోకి

**ప్రాయోదేహేశితుః సఖ్యుః దశా శుభఫలప్రదా**
**సమా సమస్య విజ్ఞేయా శత్రోః పాపఫలప్రదా ॥ 1 ॥**

తా. తరచుగా లగ్నాధిపతికి మిత్రుని దశ శుభఫలప్రదము, సమునిదశ సమ ఫలప్రదము, శత్రుని దశ పాపఫలప్రదమని ఎరుగవలెను.

*గ్రహములకుగల మిత్రత్వ, శత్రుత్వ, సమత్వములు రెండు విధములు*

*ఎట్లనగా – (1)నైసర్గికము (2) తాత్కాలికము. ఈ రెండింటివలన నిర్ణయించ బడిన శత్రుత్వ, మిత్రత్వ సమత్వముల వలన మూడవ విధము వచ్చును. దీనినే పంచధామైత్రీ చక్రము ద్వారా ప్రాచీన గ్రంథములందు నిరూపించివున్నారు. ఈ దిగువ చూపిన అ, ఆ, ఇ పట్టికలవలన సులభముగ గ్రహించుటకు వీలగును.*

**అ మిత్ర, సమ శత్రువులు**

| గ్రహములు | మిత్రులు | సములు | శత్రువులు |
|---|---|---|---|
| **రవి** | **చంద్ర,కుజ,గురు** | **బుధుడు** | **శని,శుక్ర** |
| **చంద్రుడు** | **రవి, బుధ** | **కుజ,గురు,శుక్ర,శని** | **లేరు** |
| **కుజుడు** | **రవి,చంద్ర,గురు** | **శుక్ర, శనులు** | **బుధ** |
| **బుధుడు** | **రవి,శుక్ర** | **కుజ,గురు,శని** | **చంద్ర** |
| **గురుడు** | **రవి,చంద్ర,కుజ** | **శని** | **బుధ,శుక్ర** |
| **శుక్రుడు** | **బుధ,శని** | **కుజ,గురు** | **రవి,చంద్ర** |
| **శని** | **బుధ,శుక్ర** | **గురు** | **రవి,చంద్ర,కుజ** |
| **రాహు** | **శుక్ర,శని** | **కుజ, బుధ, గురు** | **రవి,చంద్ర** |
| **శని** | **రవి,శుక్ర** | **కుజ,బుధ,గురు,శని** | **చంద్ర** |

### ఆ. తాత్కాలిక మిత్ర. శత్రువులు

ఏ గ్రహమునకైనా

| | | |
|---|---|---|
| **2,3,4,10,11,12** | భావములందుండువారు | తాత్కాలిక మిత్రులు |
| **1,5,6,7,8,9** | భావములందుండువారు | తాత్కాలిక శత్రువులు. |

### ఇ. అధిమిత్ర,, అధిశత్రువులు, సములు

నైసర్గిక మిత్రుడు తాత్కాలిక మిత్రుడైనచో అధిమిత్రుడు.

నైసర్గిక శత్రువు  తాత్కాలిక శత్రువైనచో  అధిశత్రువు.

నైసర్గిక మిత్రుడు తాత్కాలిక శత్రువైనచో  సముడగును.

నైసర్గిక మిత్రుడు తాత్కాలిక మిత్రుడైనచో సముడగును.

నైసర్గిక సముడు తాత్కాలిక  మిత్రుడైనచో మిత్రుడగును.

నైసర్గిక సముడు తాత్కాలిక శత్రువైనచో శత్రువనుగు.

**పాపాః సపత్న రంధ్రాంత్య వీర్య లాభాస్తనాయకాః**
**శుభాశ్చతుర్ధ విత్తాజ్ఞా లగ్న పుత్ర తపోఽధిపాః** **॥ 2 ॥**

తా. లగ్నమునుండి సపత్న-6, రంధ్ర-8, అంత్య-12, వీర్య-3, లాభ-11, అస్త-7 ఈ స్థానముల నాయకుల(అధిపతులు)పాపులగుదురు. చతుర్ధ-4, విత్త-2 ఆజ్ఞా-10, లగ్న-1, పుత్ర-5, తపః-9, ఈ స్థానముల అధిపతులు శుభులగుదురు.

*(అనగా త్రికములనబడు 6,8,12 స్థానములకు, ప్రతీపములనబడు 3,7,11 స్థానములకు అధిపతులు పాపులనియు, కోణములనబడు 1,5,9స్థానములకు, భోగములనబడు 2,4,10 స్థానములకు అధిపతులు శుభులనియు గ్రహించవలెను. రెండేసి స్థానములకు అధిపతులు శుభులు, పాపులు కూడా అగుచున్నారు. ఏకరాశ్యాధిపత్యముగల రవి చంద్రులు పూర్ణ శుభులగుదురు.)*

**రాశీద్వయ పతీత్వంచేత్ శుభత్వమపి పాపతా**
**విచారే తారతమ్యస్య బలీయా ద్విషమః సమాత్** **॥ 3 ॥**

తా. రెండేసి రాశులకు అధిపతులగు గ్రహములకు శుభత్వము, పాపత్వమును పట్టినపుడు, వారి అధిపత్య తారతమ్యమును, విచారణ చేయుటవలన వారికిగల్గు సరిరాశ్యాధిపత్యముకంటే బేసి రాశ్యాధిపత్యము హెచ్చు బలము గలదని తెలియవలెను.

*అనగా మేషలగ్నమునకు శుక్రుడు 2,7 స్థానముల కధిపతి యగుచున్నాడు. వీనిలో 7వ స్థానము విషమరాశి, విషమాధిపత్యము దోషము,ఇక ధనాధిపత్యము శుభము. అయినను విషమాధిపత్య బలమునుబట్టి శుక్రుడు మేషమునకు దోషియగుచున్నాడు. ఇట్లే ఇతరములను ఊహించవలెను.*

*(శని యొక్క శుభాశుత్వ తారతమ్యము మాత్రము సరి-బేసి రాశ్యాధిపత్యమును నిమిత్తము లేక యుండునని తరువాత శ్లోకములో చెప్పబడుచున్నది.)*

**యదిరాశిద్వయవతేః శుభత్వమపి పాపతా**
**సూర్యపుత్రస్య పాపత్వం శుభత్వాదతిరిచ్యతే** ॥ 4 ॥

తా. రెండు రాసుల కాధిపత్యముగల శనికి శుభత్వము పాపత్వమునుకూడా గలిగినప్పుడు ఈ రెండు ఫలములలో నతడిచ్చు పాపఫలములు శుభఫలముకంటే ( పూర్వశ్లోకములో చెప్పబడిన బలమునందు) అధికములు. *(అనగా బేసి సరిరాశుల ఆధిపత్య తారతమ్యముతో నిమిత్తము లేకుండ శని తానిచ్చు నుభయఫలములలో పాపఫలముల నిచ్చుటయందు అధికబలయుతుడని భావము)*

**శుభో పి నాధికం యోగీ చంద్రో భాస్వతి పాపిని**
**శుభే పాపోఽపి పాపోన రవిశ్చైవం నిశాకరే** ॥ 5 ॥

తా. (జాతకమందు) చంద్రుడు శుభుడైనను రవి పాపియైనప్పుడా చంద్రుడు అధిక యోగప్రదుడు(అనగా శుభప్రదుడు)కాడు. అదే విధముగా రవి పాపియైనను చంద్రుడు శుభుడైనప్పుడారవి పాపము నీయడు.

*(ఇక్కడ రెండు వాక్యములందును చంద్రుడు శుభుడై రవి పాపియగుచున్నను ఫలమునందు వ్యత్యాసము ఫలమిచ్చు కర్తనుబట్టి కలిగినట్లు గ్రహించవలెను.)*

**ధీ ధర్మజ్ఞా సుఖేశానాం బహూనా మథవా ద్వయోః**
**రంధ్రాంత్యారి పతీనాంచ సంబంధో యోగకారకః** ॥ 6 ॥

తా. పంచమ, భాగ్య, రాజ్య, సుఖాధిపతులలో ఎక్కువ మంది కలసినను, ఏ యిద్దరు కలసినను యోగకారకము. ఇట్లే షష్ఠాష్టమ వ్యయాధిపతులలో అందరు కలసినను, ఏ యిద్దరు కలసినను యోగము.

**కోణయో స్సుఖరాజ్యేశౌ కోణేశౌ సుఖరాజ్యయోః**
**స్వర్క్షం వినా త్రికేశానాః త్రికేవా యోగకారకః** ॥ 7 ॥

తా.కోణములైన 5,9 స్థానములందు 4,10స్థానాధిపతులు, 4,10స్థానము లందు కోణాధిపతులు, త్రికస్థానములలో నెవరి స్వస్థానమును వారు విడిచి యితర రెండింటి లో నుండు త్రికాధిపతులు యోగకారకులు. 6,8,12స్థానములు త్రికస్థానములు, వానిలో 6ను విడిచి 6వ స్థానాధిపతి 8,12లందుండుటయు, 8వ స్థానాధిపతి 6,12 లందుండుటయు, 12 స్థానాధిపతి 6,8లందుండటయు యోగ లక్షణము.

**శుభానామపి పాపానాం సంబంధశ్చే త్పరస్పరం**
**పాపాయోగప్రదాస్తత్ర నాతియోగకరా శ్శుభాః ॥ 8 ॥**

తా. శుభులకు పాపులకు పరస్పర సంబంధము ప్రాప్తించినచో, పాపులు యోగ ప్రదులగుదురు. శుభులు విశేషయోగప్రదులు కాకుందురు.

*ఇక్కడ శుభులు పాపులు అనగా సహజ శుభులు.పాపులు అని కాక ఆయా లగ్నములక ఆధిపత్య పాపులు అని గ్రహములని భావించవలెను. పరస్పర సంబంధ మనినప్పుడు దృష్టి. సంయోగాదులు గైకొనవలెను.)*

**త్రికే నీచగ్రహాః శ్రేష్ఠా నీచస్థానా త్రికాధిపాః**
**చతుష్టయే తుంగఖేటాః తుంగస్థావా తదీశ్వరాః ॥ 9 ॥**

తా. త్రికస్థానములందున్న నీచగ్రహములు శ్రేష్ఠులు(అనగా శుభులు.) నీచ స్థానములందున్న త్రికాధిపతులు శ్రేష్ఠులు-అట్లే కేంద్రములందు ఉచ్చను పొందిన గ్రహములకు, ఉచ్చస్థితి పొందిన కేంద్రాధిపతులు శ్రేష్ఠులు.

*(మేషలగ్నమైనచో కన్య, వృశ్చిక, మీనములు త్రికస్థానములగును, బుధ-కుజ-గురు త్రికాధిపతులుగుదురు. కన్యయందు శుక్రునకు, వృశ్చికమందు చంద్రునకు, మీనమందు బుధునకు నీచ కావున పై త్రికములందా నీచగ్రహములు శ్రేష్ఠులగుదురు త్రికాధిపతులగు బుధ,కుజ,గురులకు మీన, కర్కాటక, మకరములు వరుసగా నీచ స్థానములు గనుక వారా రాశులందు శ్రేష్ఠులగుదురు. ఇట్లే కేంద్రములను, వానియందు ఉచ్చను పొందే గ్రహములను, ఆ కేంద్రస్థానాధిపతులను, వారి కుచ్చస్థానములను చూచుకొనవలెను. ఇందుకు తోడ్పడుటకై ద్వాదశరాశులందు గ్రహములకు ఉచ్చ, నీచలను చూపు పట్టిక ఈ దిగువ నీయబడినది.) (ప్రక్కపేజీ చూడుడు)*

**త్రికే చతుష్టయేశానాః స్థితాశ్చేదల్పయోగదాః**
**విశేషణా శుభాః పాపాః త్రికేశానాశ్చతుష్టయే ॥10 ॥**

ద్వాదశ స్థానములందు గ్రహముల కుచ్చ నీచలు.

| రాశి | ఉచ్చను పొందే గ్రహము | నీచను పొందే గ్రహము |
|---|---|---|
| మేషము | రవి $10^0$ | శని $20^0$ |
| వృషభము | చంద్ర $3^0$ | – |
| మిధునం | – | – |
| కర్కాటకం | గురు $5^0$ | కుజ $28^0$ |
| సింహం | – | – |
| కన్య | బుధ $15^0$ | శుక్ర $27^0$ |
| తుల | శని $20^0$ | రవి $10^0$ |
| వృశ్చికం | – | చంద్ర $3^0$ |
| ధనుస్సు | – | – |
| మకరం | కుజ $28^0$ | గురు $5^0$ |
| కుంభం | – | – |
| మీనం | శుక్ర $27^0$ | బుధ $15^0$ |

తా. త్రికస్థానములందు కేంద్రాధిపతులు ఉండిరేని అల్పయోగము నిత్తురు. పాపులైన త్రికాధిపతులు కేంద్రస్థానములందుండెరేని విశేషమైన శుభఫలము నిత్తురు.

**ద్రవిణేవా వ్యయాధీశో వ్యయేవా ద్రవిణాధిపః**
**పరస్పరం వా యుక్తౌ తౌ ద్రవిణ వ్యయకారకౌ ॥ 11 ॥**

తా. ధన స్థానమందు వ్యయాధిపతియున్నను, ధనాధిపతి వ్యయస్థానము నందున్నను, లేదా ఒకరిలో నొకరు కలసియున్నను ధనవ్యయములకు కారకులగుదురు. (*ధనవ్యయాధిపతుల పరివర్తన దైన్యయోగమందురు.*)

**మారకౌ ధనాదారేశౌ తత్సం యుక్తో విశేషతః**
**ద్వితీయ సప్తమస్థాన స్థితవా పాపఖేచరాః ॥ 12 ॥**

తా. ధన(2), దార(7) స్థానాధిపతులు మారకులు. వారితో కలసియున్న వారు విశేషమారకులు. ద్వితీయ, సప్తమస్థానములందున్న పాపగ్రహములు మారకులే.

**సర్వేపిచ దశానాథాః స్వజాతీయ స్వభక్తిషు**
**జాతికేభ్యః ప్రయచ్ఛంతి శుభం వా ప్యశుభం ఫలమ్ ॥ 13 ॥**

తా. దశానాధులందరు తమ తమ దశలలో స్వజాతీయ గ్రహాంతర్దశల భుక్తులందును, జాతకులకు శుభఫలముగాని, అశుభఫలముగాని ఇచ్చుచుందురు.

*(ఇచ్చట గ్రంథకర్త దశానాథులందరు తామీయబోవు శుభాశుభఫలములను తమతమ స్వభుక్తులందుకూడా ఇచ్చెదరని చెప్పియున్నాడు కాని–*

**నదిశేయుర్గ్రహా స్సర్వే ద్వదశాసు స్వభక్తిషు**
**శుభాశుభఫలం నృణామాత్మభావాను రూపతః**

తా. అని చెప్పబడిన "లఘుపరాశరి" శ్లోకములో గ్రహములు తమతమ దశలలో స్వభక్తులందు ఆత్మభావాను రూపములైన శుభాశుభములు నీయరని చెప్పబడింది. " నదిశేయుః " అని లిజ్ ప్రయోగముచేత స్వల్పముగా నీయగలరను భావము తోచు చున్నది. అనగా స్వజాతీయ గ్రహాంతర్దశలయందు పూర్ణఫలమును, స్వభుక్తులందు దల్ప ఫలమును గలిగింతురని భావము.

**షష్ఠేఽష్టమే దశానాథాత్ ద్వాదశేవా స్థితో గ్రహః**
**పాపీ చేదతి పాపః స్యాత్ శుభశ్చేన్నాతి సౌఖ్యకృత్ః ॥ 14 ॥**

తా. దశానాథునకు త్రికస్థానములగు 6,8,12 నందుండు గ్రహము పాపియై నచో అతి పాపఫలమిచ్చునట్టివాడగును. శుభుడైనచో అతి సుఖకరుడు మాత్రముకాదు.

*(అనగా దశనాథుని దశయందు ఆ దశానాథులకు 6 లేక 8 లేక 12నందుండు గ్రహముయొక్క అంతర్దశ వచ్చునప్పుడా గ్రహము పాపియైనచో అంతర్దశయందు అతిపాప ఫలమిచ్చును. శుభుడైనచో శుభము నీయక మిశ్రమఫలమిచ్చునని భావించ వలెను. (ఇచ్చట నైసర్గిక శుభపాపులను గ్రహించవలెను.)*

**నైసర్గిక శుభస్వామీ సంబంధో భావపుష్టికృత్**
**నిసర్గ పాపసంబంధః కల్పతే భావ హానయే ॥ 15 ॥**

తా. నైసర్గిక శుభునితో సంబంధము భావమునకు పుష్టినిచ్చును. నైసర్గిక పాపునితో సంబంధం భావమునకు హాని(బలనష్టము) గూర్చును.

**కేంద్రకోణస్థితి ర్భావపతే ర్భావస్య వృద్ధయే**
**హానయే త్రికవర్తిత్వం సంబంధే పూర్వవత్ఫలమ్ ॥ 16 ॥**

తా. భావాధిపతికి కేంద్ర,కోణములందు స్థితియున్నచో ఆ భావమునకది బల వృద్ధినిచ్చును, త్రికస్థానములందు స్థితియున్నచో ఆ భావమునకు హాని గూర్చును. (భావాధిపతి యొక్క అట్టి స్థితివలనేగాక) సంబంధమును బట్టియు ఫలములను ఆ విధముగానే చెప్పవలెను.

**సారభూత మిదం యస్తు శ్లోక షోడశకం పఠేత్**

**మనిషీణాం సగోష్ఠీషు దైవజ్ఞః కింను మహ్యతి ॥ 17 ॥**

తా. జ్యోతిశ్శాస్త్ర సంబంధమగు శుభాశుభఫల నిరూపణమునకు సారభూతమగు నిందలి పదునాఱు శ్లోకముల నెవడు కంఠస్థమొనర్చునో ఆ దైవజ్ఞుడు విద్వాంసుల గోష్ఠులందు మోహము జెందునా ।

*(చెందడని గ్రహించవలెను. అనగా ఈ గ్రంథమును పఠించువాడు విద్వత్సభ లందు పొరపాటుకు వశుడుగాక నిరాఘాటముగా ప్రసంగించగలడని కవి ఫలశ్రుతి చెప్పుచుండెను.)*

ఇట్లు, శ్రీ భగవాన్మహర్షి రమణుని కంతేవాసియు
వాసిష్ఠ నరసింహశాస్త్రికి పుత్రుడును అగు
కావ్యకంఠ గణపతిముని కృతమైన
"షోడశ శ్లోకి' యను గ్రంథము
సమాప్తము.